# మరపురాని మనిషి

## (శ్రీ మండలి వెంకట కృష్ణారావు)



**మండలి ఫౌండేషన్**
ప్రచురణ

# మరపురాని మనిషి

(శ్రీ మండలి వెంకట కృష్ణారావు)

**MARAPURANI MANISHI**

(Sri Mandali Venkata Krishna Rao)

*ప్రథమ ముద్రణ:*

సెప్టెంబర్, 2022

*ప్రచురణ:*

**మండలి ఫౌండేషన్**

గాంధీక్షేత్రం, అవనిగడ్డ - 521 121

కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.

*ముద్రణ:*

**సాయిలిఖిత ప్రింటర్స్**

ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004.

ఫోన్: 7207045979

# ఆదర్శమూర్తి మండలి వెంకట కృష్ణారావుగారు

- ***యస్.వి.రామారావు,*** పద్మశ్రీ పురస్కార గ్రహీత,
అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందిన చిత్రకారులు

సర్వదా కృతజ్ఞతతో, పవిత్ర భావంతో, ప్రేమగా నా హృదయంలో పదిలపర్చుకున్న మహావ్యక్తి-మండలి వెంకట కృష్ణారావుగారు. వారి పేరు మీద నాకిచ్చిన పురస్కారానికి ఎంతగానో గర్వపడుతున్నాను.

ఈ పురస్కారాన్నిచ్చింది మండలి బుద్ధప్రసాద్ గారు - తండ్రిలాగే వీరునూ ఉత్తమ కుమారుడు. ఇద్దరికి ఉన్నది ఒకటే దీక్ష. అది తెలుగు వారి సంస్కృతిని, భాషను పదిలపరచడం, అభివృద్ధి చెయ్యడం. మన భాషను ఇంగ్లీషు భాష తన బలంతో తొక్కిపెట్టేస్తున్న సమయంలో, తండ్రీ కొడుకులు ఇద్దరూ కలిసి, అర్ధ శతాబ్దికి పైగా మన తెలుగును సంరక్షించే యజ్ఞంలో పాల్గొన్నారు. ఎంతమందినో తెలుగు భాషావేత్తలను గుర్తించి గౌరవించారు. వారందరికీ అండగా ఉండి, తెలుగు వారి హృదయాలను కృషితో, ప్రేమతో దోచుకున్న మహానుభావుని పురస్కారాన్ని పొందడం, ఎంత ఘనమైనదో, గౌరవప్రదమైనదో నేను గుర్తించాను. ఈ "ఆలోలాంతరాలాలలో" అన్న గేయసంపుటిని మండలి కృష్ణారావుగారికి అంకితం ఇస్తున్న సందర్భంగా, వారితో నాకున్న పరిచయాన్ని మరపురాని స్మృతులను, మీతో పంచుకోవాలని తలచాను. అందుకే ఈ వ్యాసాన్ని వ్రాశాను.

అమెరికాలో చిత్రకళలో ప్రొఫెసరుగా ఉండగా, నా పేరు మీద మా యూనివర్శిటీకి ఒక ఉత్తరం వచ్చింది బ్రౌన్ కవరులో, ప్రతి పేజీపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు సీలు ముద్రించి ఉన్నది. వివరంగా వ్రాసిన విషయాలతో - విద్యామంత్రిగారి సంతకంతో. విషయం ఏమిటంటే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు మొట్టమొదటి "ప్రపంచ తెలుగు మహాసభలను" జరుప నిర్ణయించారని, ఆ సందర్భంగా, చిత్రకారునిగా నన్ను తెలుగు మహాసభలకు ఆహ్వానిస్తున్నామని, నా అంగీకారాన్ని తెలుపగోర్తున్నామని. అంతేకాకుండా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి వెంగళరావుగారు గూడా మిమ్మల్ని ఆహ్వానిస్తూ ఉత్తరం వ్రాస్తారు అని. అదీ ఉత్తరంలో ఉన్న సారాంశం.

అలానే ఉత్తరాన్ని చేతిలో పట్టుకొని ఉండిపోయాను. ఎవరు ఈ మహానుభావుడు? ఇంత దూరాన ఉన్నటువంటి వాడిని గురించి ఎలా తెలుసుకున్నారు? ఇలాంటి సభలకు

నన్ను అహ్వానించారంటే నమ్మశక్యం లేదు. సహజంగా ఏమిటంటే తెలుగు ప్రభుత్వాలు అంతగా పట్టించుకోవు చిత్రకారుల్ని. ప్రజల్లో గుర్తింపు ఉన్న పెద్ద పెద్ద సినిమా యాక్టర్లను, సినిమాల్లో పాడేవారిని, డాన్సులు చేసేవారిని ఎక్కువగా పిలుస్తారు – ఎంతో పారితోషికాలు ఇచ్చి. అటువంటిది నన్ను పిలవడమేమిటి అన్నది అర్థం కాలేదు. మరొక సంగతి ఉన్నది ఉత్తరంలో – "అమెరికా నుండి రానుబోను విమాన ఖర్చులు మీకు ఇస్తాం. కాని ఫారిన్ కరెన్సీ అయిన డాలర్లలో ఇవ్వలేం. మా ప్రభుత్వానికి కొన్ని ఇబ్బందులున్నాయి. అందువల్ల, మిమ్మల్ని కోరేదేమిటి అంటే మీరే టిక్కెట్టు కొనుక్కొని రండి. డాలర్లలో టిక్కెట్టుకు మీరు పెట్టిన ఖర్చుకు గాను ఎంత అయితే అంత, రూపాయల్లో ఇస్తాం. హైదరాబాదుకు వచ్చిన తర్వాత, మీరు ఆంధ్రప్రదేశ్‌లో సభలకు సంబంధించి ఉన్నంత కాలం, ప్రభుత్వమే అన్ని సదుపాయాలు కలుగజేస్తుంది. కనుక మీరు వచ్చేందుకు సమ్మతం తెలుప గోర్తారని, ఈ తెలుగు జాతి మహోత్సవాలలో మీరున్నూ భాగస్వాములు అవ్వాలని, మీ అంగీకారం కొరకు ఎదురు చూస్తుంటాం. ఈ సభలను భారతదేశ రాష్ట్రపతి గారు ప్రారంభోత్సవం చేస్తారు హైదరాబాదులో".

ఎంతటి గొప్ప గౌరవం! ఎన్ని ఏండ్ల క్రిందటనో భారతదేశం వదలిపెట్టాను పై చదువుల కోసమని. భగవంతుని దయవల్ల కొంత ప్రఖ్యాతి వచ్చింది. పాశ్చాత్య దేశాలలో, నేను ఎంచుకున్న చిత్రకళా రంగంలో– నా కృషిని గుర్తించారా విద్యాశాఖామంత్రి గారు! ఆయన తప్పకుండా విశేషమైన వ్యక్తి అయి ఉండాలి. అంతటివారు నాలాంటి వాడిని గుర్తించి పిలుస్తున్నారంటే, మరి ఇంకెంత మందినో గూడ పిలుస్తున్నారన్నమాట ప్రపంచం నలుమూలల నుండి. ఎంత కష్టపడ్డారో గదా, మన తెలుగు ప్రముఖులు ఎక్కడెక్కడ ప్రపంచంలో ఉన్నారో తెలుసుకునేందుకు. ఇలా తలస్తే నా గుండె జలదరించింది. ఈయనను చూడాలి. వారికి నమస్కారం పెట్టాలి అని అనుకున్నాను. ఒక వారం రోజుల తర్వాత ముఖ్యమంత్రి వెంగళరావు గారి నుండి ఉత్తరం – అహ్వానిస్తూ, నన్ను సభలకు రమ్మని.

దీని అంతటికి ముఖ్య కారకులు మండలి వెంకట కృష్ణారావుగారని అర్థం అయిపోయింది. ఏనాడు వీరిద్దర్నీ కలువలేదు. వీళ్ళు ఎవరో కూడా తెలియదు. నన్ను చిత్రకారునిగా గుర్తించిన వ్యక్తిపై ఎనలేని కృతజ్ఞతా భావం కలిగింది. ఎన్ని ప్రయాసలకు ఓర్చి ఈ సభలను ఏర్పాటు చేస్తున్నదో ప్రభుత్వం ఊహించగలిగాను. ఎన్ని సంవత్సరాల నుండి ప్రయత్నాలు చేస్తున్నారో! నేను తప్పనిసరిగా వెళ్ళి తీరాలి ఈ సభలకు అనుకున్నాను. వీరిద్దరూ పంపిన ఉత్తరాలు చదివి తెలుగువాడిగా గర్వపడ్డాను. ఈ మహోత్సవాలలో పాల్గొని సభలు జయప్రదం అయ్యేట్లు చూస్తున్న మహామహులందరితో పాటుగా నేనున్నూ తెలుగువాడిగా కృషి చేయడం నా కర్తవ్యం అని భావించాను. అందరితో కలిసి "జై ఆంధ్ర" "జై భారతమాతకు జై" అని అరవాలంటే ఈ మహాసభల్లో పాల్గొనడం తప్పనిసరి. ఈ సభల్లో, నేనూ మీలో ఒక్కడిని అని, సగర్వంగా తలుస్తూ నా బాధ్యతాయుత కర్తవ్యాన్ని దీక్షతో తీర్చుకోవలసిన సమయం, ఇదే అని దృఢంగా నమ్మాను.

నేనున్న యూనివర్సిటి 'కెంటకి" అన్న రాష్ట్రంలోని 'బౌలింగ్ గ్రీన్' అన్న ఊర్లో ఉంది. అక్కడ ఎయిర్‌పోర్టు లేదు. అందుకని టిన్నెసి అన్న ప్రక్క రాష్ట్రానికి 70 మైళ్ళు కారు డ్రైవ్ చేసుకొని వెళ్ళాలి. అక్కడ విమానం ఎక్కి న్యూయార్క్ నగరం రావాలి. అది చాలా దూరం. అక్కడ నుండి ఎయిరిండియా బొంబాయి రావాలి. అక్కడ నుండి ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో హైదరాబాదు రావాలి. పెద్ద యాతనతో కూడుకున్న వ్యవహారం. ఈ రోజుల్లో అలా కాదు. ప్రయాణాలు అమెరికా నుండి హైదరాబాదుకు రావడం సులువు.

టిక్కెట్టు కొనుక్కొని హైదరాబాదు వచ్చాను. నన్ను రిసీవ్ చేసుకునేందుకు ఎవరో వచ్చారు. నన్ను కారులో తీసుకొని వెళ్ళి 'రిట్జ్' హోటల్‌లో ఉంచారు. స్నానం చేసుకున్న తర్వాత ప్రపంచ తెలుగు మహాసభల సెంట్రల్ ఆఫీసుకు వెళ్ళాను. జనం కిక్కిరిసి ఉన్నారు. ఎన్నో టేబుల్స్ ఉన్నాయి. అవి సభల ఏర్పాట్లు చేసేవారివి అనుకుంటాను. వారి చెంతన వంగి వింటున్న వారికి ఏవేవో పనులు, ఇన్‌స్ట్రక్షన్స్ ఇస్తున్నారు. వారు అసిస్టెంట్లు గాబోలు. టేబుల్ చుట్టూ చాలా మంది గుంపులుగా నిలబడి, ఏవేవో అడుగుతున్నారు. అంతా సందడిగా బిజీగా ఉంది. ఎవరిని అడగాలో ఈ సభల గురించి నాకు తెలియలేదు. హుందాగా నిల్చున్న ఒక బ్యాడ్జి పెట్టుకున్న మధ్యవయసు దాటిన, తెల్లపంచె - లాల్చీ వేసుకున్నవారు నిల్చుండి ఈ ప్రక్రియలన్నిటిని చూస్తున్నారు. ఆయన చుట్టూ ఎవరూ లేరు. ఆయన దగ్గరకు వెళ్ళాను "ఏమండీ! నేను శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారిని కలవాలి" అన్నాను. నాకు కృష్ణారావుగారిని కలవడం అన్నది ముఖ్య విషయం. కలిసి వారికి నమస్కారం పెట్టాలన్నది స్థిర నిశ్చయం. ఆయన నన్ను ఏగాదిగా చూశారు.

"కృష్ణారావు గారిని కలుస్తారా? అందరూ ఆయన్ని కలుద్దామనుకుంటారు. అది ఎలా వీలుపడుద్ది? ఆయన మంత్రిగారు కదా! ఈ సభల పనుల్లో మునిగిపోయి ఉన్నారు. ఎక్కడ ఉన్నారో తెలియదు. లక్షా తొంభై పనులు చేస్తుంటారు" అని ఆయన ఇదివరకు చేస్తున్న పర్యవేక్షణలోనికి, మునుపటి స్థితిలోకి వెళ్ళిపోయారు. నన్ను పట్టించుకోలేదు.

నిరాశపడినా మరింత ప్రయత్నం చెయ్యాలి అనుకొని - అన్నాను వారితో "చూడండి సార్! ఈ ఉత్తరం వ్రాశారు మంత్రి గారు" అని చూపించాను వారికి. ఉత్తరం చేత్తో పట్టుకొని చదువుతున్నారు. నా సంభాషణ సాగించాను. "వారి కాలాన్ని ఎక్కువగా తీసుకోను. ఒక్కసారి కలిసి నమస్కారం చేద్దామన్నదే నా ఉద్దేశ్యం. ఇక్కడ ఉన్న రోజుల్లో ఎలా అయినా కలుస్తాను గదా వారిని. అయినా మిమ్మల్ని చూస్తుంటే అనిపించింది నాకు. మీరు చాలా ముఖ్యులు ఈ సభల్లో అని, ఏదైనా పెద్దవారై ఉంటారు సంఘంలో అని అనిపించింది. అందుకే మీ సహకారం అడుగుతున్నాను" అన్నాను.

ఏమనుకున్నారో ఏమో, దూరంగా ఎవరో ఉంటే వారిని, చప్పట్లు కొట్టి పిలిచారు తన దగ్గరకు రమ్మని. ఆయన వచ్చారు. "వీరిని తీసుకొని వెళ్ళి మంత్రి కృష్ణారావు గారు ఎక్కడ ఉంటే అక్కడకు వెళ్ళి, రామారావు గారిని కలిపించు. "మీరు ఇతనితో వెళ్ళండి" అని తన పనిలో తాను మునిగిపోయారు. పిలిచిన ఆయన నన్ను దూరంగా ఉన్న ఒక కుర్చీలో కూర్చుండమని చెప్పి, "మంత్రిగారు ఎక్కడ ఉన్నారో తెలుసుకున్న తర్వాత,

మిమ్మల్ని వారి దగ్గరకు తీసుకొని వెళ్తాను” అన్నారు. ఒక 20 నిమిషాల్లో వచ్చి నన్ను తీసుకొని ఏదో ఒక రూములో కొద్దిమందితో మాట్లాడుతున్న వ్యక్తి దగ్గరకు తీసుకొని వెళ్ళారు. “సార్, వీరి పేరు రామారావు గారట. మిమ్మల్ని కలవాలని వచ్చారు” అని చెప్పి నన్ను ఆయన దగ్గర వదలి, తాను వెళ్ళిపోయారు.

ఎంత సాదాసీదా మనిషి! పటాటోపాలు లేని ఒక గ్రామస్తునిలా ఉన్నారు. దయార్ధ్రమైన కండ్లు, అలసిన ముఖం. చొక్కా ముడతలతో నలిగి ఉన్నది. ఖద్దరు, ముతక చొక్కా అనుకుంటాను. “మీరా రామారావుగారు. ఎస్వీ రామారావుగారు కదూ? చిత్రకారులు- అమెరికా నుండి. ఎంతో సంతోషంగా ఉంది మిమ్మల్ని కలవడం. ప్రయాణం బాగా జరిగిందా?” అంటూ చిరునవ్వుతో, నమస్కరిస్తున్న నా రెండు చేతుల్ని తమ చేతుల్లో పట్టుకున్నారు. ఎంతో అనందంగా ఉంది మీరు మన సభలకు రావడం. ఎన్నెన్నో దేశాల నుండి మన తెలుగు వారు వస్తున్నారు. మన రాష్ట్రంలో ఉన్నవారు ఎదురు చూస్తున్నారు. మీలాంటి తెలుగువారు విదేశాల్లో నివసిస్తూ, మీమీ రంగాలలో తెచ్చుకున్న పేరు, మీరు సాధించిన విజయాలను గురించి వినాలని కుతూహల పడుతున్నారు. మీరు చెప్పాలి మాకు. భారతదేశంలోనే ఎంతోమంది గొప్ప వారున్నారు. మన తెలుగువాళ్ళ గురించి ఈ సభల్లో జరిగిన విశేషాలన్నిటిని మీరు తిరిగి వెళ్ళిన తరువాత మీ మీ దేశాల్లోని వారందరికి చెప్పాలి - మన తెలుగు సంస్కృతిని గురించి. మేము సాధించిన, సాధిస్తున్న విషయాలను గురించి. అందుకే ఈ సభలను ఏర్పాటు చేస్తున్నాం. అభిప్రాయాల్ని పంచుకోవడానికి, మనల్ని మనం కండ్లతో చూసుకోవడానికి, ఆంధ్రప్రదేశ్‌లో నివసించే తెలుగువారు, ఇతర రాష్ట్రాలలో ఉన్న తెలుగువారు, ప్రపంచంలో ఉన్న అందరు తెలుగువారు కలుసుకునేందుకు కావలసిన ఏర్పాట్లు చేస్తున్నాం. ఉపన్యాసాలకు ఎన్నో సభా వేదికలు, సంగీత, నృత్య, సాహిత్య, చిత్రకళల ప్రదర్శనలకు ఎన్నో వేదికలను ఏర్పరిచాం. కేంద్ర మంత్రులు, ముఖ్యమంత్రులు ఎంతోమంది మన సంస్కృతిని చూసేందుకు వస్తున్నారు దేశం నలుమూలల నుండి” అంటూ, అలా అలా చెప్పుకుపోతున్నారు. రాత్రింబవళ్ళు వీరు సభల గురించే అలోచిస్తున్న వ్యక్తిగా తట్టింది. ఎంత ఉత్సాహం! ఎంత సంతోషం!

ఇంత సింపుల్ మనిషి ఇంత బృహత్తరమైన కార్యాన్ని తలపెట్టారంటే నమ్మశక్యం కాలేదు. తేలికగా నవ్వుతూ, అనందంగా ఎంత పనినైనా అలవోకగా చెయ్యగలను అన్న ధీమా కనిపించింది వారిలో. ఒకర్ని పిలిచి నిన్న వచ్చిన హిందూ దినపత్రికను తెమ్మన్నారు. “కొద్దిమంది వాలంటీర్లను ప్రత్యేకంగా, ఎంపిక చేశాం, ఇతర దేశాల నుండి వచ్చే అతిథుల సౌకర్యాలను చూసేందుకు. అమెరికా నుండి వచ్చిన వారిని చూసేందుకు ఉన్న వాలంటీర్లలో ఒకర్ని పిలుస్తాను. అతను, అతనితో పాటుగా ఉన్నవారు మీ సౌకర్యాలను చూస్తారు - మీకేమి ఇబ్బందులు లేకుండా. మీతో తెలుగు వంటల్ని - ఉలవచారుతో - సహా తినిపిస్తాం” అన్నారు నవ్వుతూ మండలి కృష్ణారావుగారు.

నాకు వీరిలో ఒక మంత్రిగారికి ఉండవలసిన లక్షణాలేమి కనిపించలేదు. ఆయన్ని అలానే పరిశీలిస్తున్నాను. ఇస్త్రీ చేసినా నలిగిపోయిన గంజి పెట్టినా ముడతలతో ఉన్న

చొక్కా వ్రేళ్ళకు ఉంగరా లేమి లేవు. ఆయనకు ముందు, వెనుక, ప్రక్కన నిలబడ్డ బంట్రోతులు లేరు, ఎయిర్ కండీషన్ ఉన్న మంత్రిగారి ఆఫీసులో కూర్చోలేదు. అందరితో కలిసిపోయి, పనిచేస్తున్న వారిలో ఒకరుగా ఉన్నారు. చూసిన వారు, క్రొత్తవారు, నాలాంటి వారు ఎవరూ వీరిని మంత్రిగారు అనుకోరు.

ఇంతలో ఎవరో వచ్చి పేపరు అందించారు వారి చేతికి, అది నాకిస్తూ "ఇది మీకు. ఇందులో మనం ఏర్పాటు చేస్తున్న ప్రపంచ తెలుగు మహాసభల ఉద్దేశాల గురించి, సభల్లో ఏర్పాటు చేస్తున్న సభల వివరాలు, విచ్చేసే పెద్దల గురించి, ఏఏ పనులు ఎలా జరుగుతున్నాయో అన్న వివరాలు ఉన్నాయి. అన్ని పేపర్లు వ్రాశాయి. రోజూ వస్తూనే ఉన్నాయి వ్యాసాలు మన సభల గురించి. మీరు హోటల్‌కు వెళ్ళి కాస్త నిద్రపోయి, సాయంత్రం 5 గంటలకు "గెట్ టు గెదర్" కు రండి. అక్కడ చాలామందిని కలుస్తారు. సభలు అయ్యేంత వరకు, "గెట్ టుగెదర్" లు ఉంటాయి" అన్నారు. ఒకరిని పిలిచి నాతో చెప్పారు "ఇతను అమెరికా నుండి వచ్చేవారి సౌకర్యాలు చూస్తారు". రామారావుగారిని హోటల్‌కు తీసుకొని వెళ్ళి 5 గంటలకు తిరిగి వారిని ఈ సభలకు తీసుకురావాలి అని అతనికి చెప్పారు. నాతో పాటు అతను "%ప్త్రుఊఎ ఒళిశిలిజి%"కు వచ్చి నా భోజన సదుపాయాలు, హోటల్ ఏర్పాట్లు చేశారు ఫ్రంట్ డెస్క్ అతనితో మాట్లాడి. నేను వారి దగ్గర సెలవు తీసుకొని నా గదికి వెళ్ళాను లిఫ్టులో.

నేను మాట్లాడింది ఏమీ లేదు. ఆయన ముందు నిలబడ్డాను. అంతే! ఏదో వారిలో ఉన్న శక్తి నాతో ఇలా అన్నట్లుగా, అనిపించింది. "మేము అతి సామాన్యులం, అలానే జీవిస్తూ ఉంటాం. కాని ఎంత అసాధారణ పనులనైనా సాధించగలం. అది మన భూమి, మన సంస్కృతి ఇచ్చిన శక్తి ఆయనలో ఉన్న మహత్తర శక్తికి, తలవాంచాల్సిందే, ఎవరైనా సరే అనుకున్నాను. తీరిక ఎరుగని శ్రమతో రాత్రింబవళ్ళు పని చేస్తున్నారు. వారికి ఎన్నిసార్లు గానో నమస్కారాలు పెట్టుకున్నాను మనసులో.

హోటల్లో భోజనం చేశాను. సిల్వర్ కట్లరి అంతా, భోజనం చాలా బాగుంది. హైదరాబాదులో ఇంతకంటే గొప్ప హోటల్ మరొకటి లేదట. "ఫైవ్‌స్టార్ హోటల్" కదా అది. నాకు ఇచ్చిన హిందూ దినపత్రికను చూశాను. ఈ ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు మన భారతదేశంలో, భాషాయుక్తంగా, జరిగే మొట్టమొదటి సభలు. ఏ భాషవారు (అన్ని భాషల కంటే ఎక్కువగా అర్థం అయ్యేది ప్రజలకు హిందీ భాష అయినా ప్రపంచ హిందీ మహాసభల్ని ఎవరూ చెయ్యలేదు) వారి వారి భాషల్లో ప్రపంచ మహాసభల్ని జరుపలేదు. మన తెలుగు మొట్టమొదటిది. తెలుగువారే భాషాయుక్తంగా చేసిన సభలతో, భారతీయ భాషలకు మార్గదర్శకులమైనాము అన్నమాట – కానీ తర్వాత ఎవరో అన్నారు – తమిళులు, వారి ప్రపంచ తమిళ భాషా సభలను ఏర్పాటు చేశారని, తర్వాతగా రెండవదిగా నిలిచేది తెలుగువారి "ప్రపంచ తెలుగు మహాసభలు" అని. నిజం నాకు తెలియదు.

మరొక విషయం కూడ చదివాను ఈ పేపర్‌లోనే. మంత్రిగారు మండలి కృష్ణారావుగారు ఇచ్చిన ప్రెస్‌మీట్‌లో "మన ప్రపంచ తెలుగు మహాసభల్లో

పాల్గొనేందుకు, అమెరికా నుండి ప్రపంచ ప్రసిద్ధ తెలుగు చిత్రకారుడు శ్రీ ఎస్.వి. రామారావుగారు, లండన్ నుండి ప్రపంచ ప్రసిద్ధ గాయకురాలు, నృత్యకారిణి టంగుటూరి సూర్యకుమారిగారు మన ఆహ్వానాన్ని అంగీకరించి వస్తున్నట్లుగా అంగీకారం తెలిపారు" అని. కృతజ్ఞతతో నా హృదయం నిండిపోయింది. ఇంతటి గౌరవాన్ని నాకు అందించిన మండలి వెంకట కృష్ణారావు గారి విశాల హృదయాన్ని ఎవరైనా కొలవగలరా? ఒక తెలుగు చిత్రకారునిగా, ప్రపంచంలో ఉన్న తెలుగు వారందరికి నన్ను పరిచయం చేసిన వ్యక్తిగా, నా హృదయం నిండా వ్యాపించి ఉన్నారు. వారిని తలచుకుంటేనే, పేరు వింటేనే నమస్కారాలు పెడ్తాను.

ఈ ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల్లో చిత్రకళపై ఏర్పాటు చెయ్యబడ్డ సభల్లో పాల్గొని, నడిపించే బాధ్యత తీసుకొన్నాను. శ్రీ సంజీవదేవ్ గారిని, శాంతి నికేతనంలో చిత్రకళ నేర్చుకున్న మాచెర్ల నివాసులు, ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ గుఱ్ఱం మల్లయ్య గారిని పిలిచి, వారితో దీర్ఘోపన్యాసాలు ఇప్పించాను. సభలో ఉన్నవారు ముగ్ధులయ్యారు. సభల తరఫున ఏర్పాటు చెయ్యబడ్డ ఆంధ్రప్రదేశ్ చిత్రకళా ప్రదర్శనలో, ఏకైక జడ్జిగా ఉత్తమమైన చిత్రాలను ఎంపిక చేశాను. వాటికి నగదు బహుమతులు ఇవ్వబడ్డాయి. నేను ఈ కళా ప్రదర్శనల సమయంలో వచ్చిన చిత్రకారులను (ఇప్పటికే దివగంతులైన వారిని, బ్రతికి ఉన్న మహామహులను) గురించి మాట్లాడాను. ఈ సభలో తోటి చిత్రకారుల మధ్య ఉన్నందుకు పరమానందపడ్డాను, గర్వపడ్డాను. తర్వాత జరిగింది నేను మర్చిపోవాలన్నా మర్చిపోలేనిది. భారతదేశ ప్రెసిడెంటు గారు, అనేక మంది దేశ విదేశాల నుండి వచ్చి ఉన్న వారితో నిండిపోయిన సభ అది. ఆ మెయిన్ సభావేదికపై నన్ను కృష్ణారావుగారు మాట్లాడమంటే నేను మాట్లాడాను, అప్పుడే, నేను మాట్లాడుతుంటుంటే అందరికీ ఆప్తులైన బెజవాడ గోపాలరెడ్డిగారు (అప్పుడు కేంద్ర మంత్రిగా ఉన్నారు) స్టేజి మీదకు వచ్చారు. నా భుజంపై ఆయన చెయ్యి ఉంచి, "ఉండవయ్యా! రామారావు, నేనూ మాట్లాడతాను" అంటూ ఆయన మాట్లాడుతుంటుంటే ప్రేక్షకులు చప్పట్లు కొట్టారు. ఆయన, నేను స్టేజి మీదనే ఉన్నాం. ఎంతో ఎత్తుగా, హుందాతో నిండైన గాంభీర్యతతో కన్పించే వ్యక్తి. ఆయన పక్కన నేను నుంచొని ఉంటే పొట్టిగా, పీలగా ఉన్న చిన్ని వ్యక్తిని. ఆయన మాట్లాడుతున్నారు ఆ అనుభూతిని ఎలా చెప్పగలను. నేను స్వర్గంలో ఉన్నాను అని అనుకున్నాను. ఎన్నో సంఘటనలు, ఎన్నో అనందదాయకమైన విశేషాలు అ సభల్లో జరిగాయి.

ఆ సభల్లోనే అమెరికా నుండి వచ్చిన ఒక అమ్మాయి, అమెరికా నుండి వచ్చిన ఒక అబ్బాయి పెండ్లి చేసుకుంటామని నిర్ణయం తీసుకొన్నారు. ఎంతో ముచ్చటగా ఉంది ఆ సందర్భం. అందరం వాళ్ళిద్దరి చుట్టూ చేరి శుభాకాంక్షలు తెలుపుతూ, చప్పట్లతో విదేశాల నుండి వచ్చిన తెలుగు వారందరం ఈలలతో సంతోషాన్ని వెలిబుచ్చాం. ఎన్నో సభలు, ఎంతో ఘనంగా జరిగాయి కార్యక్రమాలన్నీ ఈ సభలన్నీ ప్రేక్షకుల మన్ననలు పొందాయి. కిక్కిరిసి, ఇసుక వేస్తే రాలనంతమంది జనం ఉన్నారు. మలేసియా, మోరిషియస్ దేశాల నుండి, ఇతర అసియా ఖండంలోని అనేక ఇతర దేశాల నుండే

కాక, బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా, ఆఫ్రికా ఖండంలోని ఎన్నో దేశాల నుండి, అనేక కరేబియన్ Island దేశాల నుండి ఎంతో ఎంతోమంది వచ్చారు. భారతదేశ రాష్ట్రపతి, చాలామంది కేంద్రమంత్రులు, పార్లమెంటు మెంబర్లు వచ్చారు. హైదరాబాదు నగరం మారుమోగింది తెలుగువాణితో. పట్టలేనంత అనందం ఇచ్చాయి ఈ సభలు. దేశం అంతటా ఈ కీర్తి ఒక్క మండలి వెంకట కృష్ణారావుగారికే చెందుతుందని అందరూ అనుకున్నారు.

సభలు ముగిసిపోయి కొంత కాలం అయిపోయింది.

'పేపర్లలో చదువుతున్నాను. ఫొటోలు చూశాను. పెనుతుఫాన్ మన ఆంధ్రప్రదేశ్ కోస్తా అంతటిని బీభత్సం చేస్తున్నదని. అవనిగడ్డ ఊరును, చుట్టుప్రక్కల గ్రామాలనన్నింటిని, గుడిసెలను, పెంకులతో కట్టిన ఇళ్ళను, దాబాలను, మనుషుల్ని గొడ్లను దిగమింగుతున్నాయి ఆకాశాన్ని అంటుకుంటూన్న సముద్రపు అలలు. గాలి బలం, ఏనుగులను గూడ లేపుకుని వెళ్ళగలదు. అటువంటి పరిస్థితిని ఎవరూ చూచి ఉండలేదు. రోడ్డు, రైలు మార్గాలు అన్నీ బంద్ చేశారు. కోస్తా జిల్లాలన్నీ ప్రయాణాలు బంద్. ఎక్కడి వారు అక్కడే ఉండిపోయారు. అవనిగడ్డ తనకు తానే పరిరక్షించుకోవలసిన పరిస్థితి.

విన్నాను. చదివాను పేపర్లలో. నేను అప్పుడు అమెరికా నుండి వచ్చి ఉన్నాను. మండలి వెంకట కృష్ణారావుగారిది అవనిగడ్డ. నా ఊరు గుడివాడ – చాలా దగ్గరే అవనిగడ్డకు – ఈ రెండు ఊళ్ళూ కృష్ణా జిల్లాలోనివే. "నా దివిసీమ ప్రాంతమంతా కనీవిని ఎరుగని విపత్తులో ఉంది. ఈ ప్రాంతంలోని పరిస్థితులు చక్కబడే వరకు, ప్రజలు సురక్షితంగా ఉన్నంతవరకు ఇక్కడే ఉంటాను నేను. హైదరాబాదులోని అసెంబ్లీకి రాను' ' అని ముఖ్యమంత్రిగారికి ఉత్తరం వ్రాశారట. "అవనిగడ్డ విడిచి ఎక్కడకూ వెళ్ళను ఈ కారణాల వల్లనే రాజీనామా చేస్తున్నాను నా మంత్రి పదవికి" అని ఉత్తరం ముఖ్యమంత్రి గారికి పంపారట. అలా అని పేపర్లలో చదివాను. కాని వెంగళరావుగారు ఈ రాజీనామాను అమోదించలేదట. అనాటి మరొక మహావ్యక్తి టంగుటూరి ప్రకాశం పంతులుగారిని మైమరపించిన మహోన్నత వ్యక్తి, ధీరుడు కృష్ణారావుగారు.

ఊళ్ళో వారినందరిని ఉత్తేజపరిచి పనిలోకి దిగారు. చనిపోయి ఉబ్బిపోయిన గేదెలు, ఎద్దులు, ఆవులు, కుక్కలు, మనుషుల శవాలతో నిండిపోయి వరదల్లో కొట్టుకు వస్తున్నాయి అవనిగడ్డ ఊరిలోనికి. చాలా వరకు ఇంకా నీటిలోనే ఉండిపోయి, కుళ్ళి దుర్గంధ వాసనలతో భరించలేనంత కంపుకొడుతున్నవి. ఊళ్ళను దిగమ్రింగిన సముద్రం, అన్ని దివిసీమలోని పట్టణాలకు, పల్లెల్లోనికి, ఊళ్ళలోకి వచ్చేసింది. కృష్ణారావు గారు ఆ నీళ్ళలోకి, వాసనతో మురికితో భరించలేని కంపు నీళ్ళలోకి, తన నడుం వరకు వచ్చేంత నీళ్ళలోనికి దిగి, తేలుతున్న శవాలను బయటకు లాగి, భూమి మీదకు తెచ్చి, దహన కార్యక్రమాలు చేశారు. చేయించారు. రాత్రింబవళ్ళుగా కంటికి నిద్ర లేకుండగా, కడుపు ఆకలిని మర్చిపోయి, దివిసీమ కష్టాల్లో ఉంటే కరిగిపోయి దివిసీమ సంరక్షణ కృషిలోనే

మునిగిపోయేందుకు తనకు తానుగా అర్పించుకున్న అజరామరుడు, అ మహానుభావుడు. అలా అని నేనే కాదు అన్నది. అనాటి పేపర్లన్నీ కృష్ణారావుగారి సాహసాన్ని భగీరథుని లాంటి అసాధారణ దీక్షగా వేనోళ్ళ కొనియాడాయి. వారు చేసిన సేవను ఇండియాలోని అన్ని న్యూస్ పేపర్లలో, ఫొటోల్లో, టీవీల్లో చూస్తూ తెలుగువారు తమ కళ్ళవెంట కారే నీటిని అపుకోలేకపోయారు. అప్పుడు తెలిసింది ఆంధ్రప్రదేశ్ అంతటా కృష్ణారావుగారు ఎటువంటి నిస్వార్థపరుడో, ప్రజా సేవకుడో, ప్రజా నాయకుడో అని.

ఆ భీభత్సం అనంతరం, ఎంతోమంది పిల్లలు, తల్లిదండ్రులు పోగొట్టుకున్న వారు, అనాథలై మిగిలారు. వారందరినీ దత్తత తీసుకొని వారికి పాఠశాలలు కట్టించారు చదువు చెప్పడానికి. అవి సాగుతున్నాయి. ప్రింటింగ్ పెట్టి, కుట్టు మిషన్లు తెప్పించి వృత్తి విద్యలను నేర్పడం ప్రారంభించారు. ఈ పిల్లలలో స్వతంత్రంగా బ్రతకడానికి ఏవైతే అవసరమో అవన్నీ చేస్తాను అని ప్రతిజ్ఞ పట్టారు. ఒక మ్యూజియంను కట్టారు. ఉప్పెన భీభత్స విలయతాండవాన్ని న్యూస్ పేపర్లలో వచ్చిన ఫొటోలు, ఎవరెవరు పెద్ద పెద్దవారు దివిసీమకు వచ్చింది ఉప్పెన తర్వాత కాలాల్లో, ఇతర ముఖ్య వివరాలతో, ముందుతరాల వారికి తెలిసేలా భద్రపరచి ఈ మ్యూజియంను తీర్చిదిద్దారు. ఇది దివిసీమ ప్రజల సాహసోపేతమైన ప్రయత్నాలను చూపిస్తుంది. ప్రకృతి వైపరీత్యాన్ని ఎలా ఎదుర్కోగలిగారో, ఎలా ప్రకృతిని శాంతపరిచారో చెప్తుంది మ్యూజియం. ఎంతోమంది ఇతర రాష్ట్రాల నుండి, మన రాష్ట్రం నుండి, విదేశాల నుండి మ్యూజియాన్ని చూడ్డానికి వచ్చారు. ఏమి జరిగిందో, ఎలా జరిగిందో ఆ భయంకర ప్రకృతి ప్రళయ తాండవాన్ని చూసేందుకు. నేనూ వచ్చాను నా ఆప్తమిత్రుడు సి.ఆర్. దాసుగారితో కలిసి అవనిగడ్డకు. కృష్ణారావుగారే స్వయంగా చూపించారు మ్యూజియంను, విద్య గరుపుతున్న స్కూళ్ళను, ప్రింటింగ్ ప్రెస్‌లను. ఇతర కార్యక్రమాలను గురించి వివరణగా చెప్పారు. నా అదృష్టమేమంటే, నా తైలవర్ణ చిత్రం ఒకదాన్ని ఈ మ్యూజియంలోనే ఉంచారు వారు. అది గాలివాన భీభత్సాన్ని చూచించే తైలవర్ణ నైరూప్య పెయింటింగ్. దాన్ని నేను హైదరాబాదులో చిత్రించాను. చాలాసార్లు వచ్చాను కృష్ణారావుగారిని చూడటానికి అవనిగడ్డకు, ఈ పుణ్యభూమికి. వారు పరమపదించిన తర్వాత కూడా ఎన్నోసార్లుగా వచ్చాను బుద్ధప్రసాద్‌గారి ఆహ్వానంతో.

ఈ సందర్భంగా మరొక్క విషయం – తండ్రీ కొడుకులు అందించిన గౌరవాన్ని ఎంతో ఎంతో కృతజ్ఞతతో, నా హృదయంలో భద్రపరచుకున్న సంగతిని మీ ముందు ఉంచాలి. ఇంతకంటే మరో మంచి తరుణం మరల ఎప్పుడు వస్తుందో తెలియదు గదా! చెప్పాను గదా మండలి వెంకట కృష్ణారావుగారు మంత్రిగా ఉన్నపుడు, ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలను అమోఘంగా, కనీవినీ ఎరుగనట్లు జరిపించారని, అప్పుడు నన్ను అమెరికా నుండి పిలిపించారని, ఆనాటి భారతదేశపు రాష్ట్రపతిగారితో సన్మానం చేయించారని. నాతో పాటు మరి కొద్దిమందిని, వారి వారి రంగాలలో నిష్ణాతులైన వారిని ఎంపిక చేశారు. ఈ సందర్భం నేను జన్మలో మరువలేని విషయం.

చూడండి! భగవన్నిర్ణయం. తండ్రిగారి వారసత్వానికి అర్హులై మండలి

బుద్ధప్రసాద్‌గారు మంత్రి పదవిని పొందారు. నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభలను జరిపించారు తిరుపతిలో. తండ్రి అంతటి ఘనుడు, సత్పురుషుడు, కార్యదీక్షా పరాయణుడు, తండ్రిలా చిరునవ్వుతో "మేము సామాన్యులం, అలానే జీవిస్తూ ఉంటాము. కానీ ఎంత అసాధారణమైన పనులనైనా సాధించగలం. ఇది మన భూమి, మన సంస్కృతి ఇచ్చిన మహత్తర శక్తి మనకు. ఎలాంటి బరువునైనా మోయగలను, ఏమి కావాలో చెప్పండి మీకు... నేను చేసి పెడతాను వెంటనే" అనే కళాపిపాసకులు, ప్రజల మనిషి శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు.

నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభలకు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు నన్ను తిరుపతికి పిలిపించారు. కళోద్ధారకుడు తండ్రిలాంటి సుపుత్రుడు కనుకనే, తండ్రిలానే తానున్నూ ఈ సభలను అత్యద్భుతంగా జరిపించారు, తన అధీనంలో. ఇలా తండ్రీ కొడుకులు ప్రపంచ తెలుగు మహాసభలు జరిపించడం ఒక విశేషమైన, 'Coincidence' కదూ! వీరిద్దరితో సన్మానించబడటం అలాంటి సభల్లోనే దశాబ్దాల తరువాత %--% అదినా జన్మ సార్థకత్వం. ఆ సభల్లో మన రాష్ట్రపతి శ్రీ ప్రణబ్ ముఖర్జీగారితో సన్మానం చేయించారు. చిత్రకళా రంగంలో నేను నిరంతర కృషి పెడుతున్నందుకు, నా సృజనాత్మక చిత్రకళా ప్రపంచంలోని నిష్ణాతులందరి మన్ననలను పొందినందుకు. ఈ రోజుల్లో ప్రభుత్వాలు అంతగా గుర్తించడం లేదు చిత్రకారుల్ని. ఆలోచించండి ఒకసారి. తండ్రీ కొడుకులు మన ఆంధ్రప్రదేశ్‌లో మంత్రులు అవడం, సాహిత్య కళా రంగాల పురోభివృద్ధికి నిరంతర కృషి పెట్టడం, సామాన్య ప్రజల్ని దృష్టిలో ఉంచుకొని రాజకీయ జీవితాన్ని నడపగలగడం అన్నది జరగడం, అరుదైన విషయం. ఇద్దరూ ప్రజానీకపు ఆమోదాన్ని పొందిన వారే. ఎంత అదృష్టవంతులు దివిసీమ పౌరులు, ఆంధ్రప్రదేశ్ ప్రజలు! దివిసీమకు ఉప్పెనలు మరల మరల ఎన్నో సార్లుగా వస్తే శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారి కృషి, వారి తండ్రి గారిని గుర్తుకు తెచ్చింది అందరికి. మరొకసారిగా ఉప్పెన వచ్చి అవనిగడ్డను భీభత్సం చేసింది. ఈ సందర్భంగా మండలి బుద్ధప్రసాద్‌గారు ఎన్నో కార్లు ఏర్పాటు చేశారు విజయవాడ నుండి, హైదరాబాదు నుండి, మద్రాసు నుండి వచ్చిన ఎంతోమంది ప్రముఖులను, వాలంటీర్లను అవనిగడ్డ రప్పించేందుకని. విజయవాడలోని హోటల్స్‌లో బస ఏర్పాటు చేశారు అందరికి. హైదరాబాదు నుండి కృష్ణాపత్రిక దినపత్రిక ఎడిటరు గారైన పిరాట్ల వెంకటేశ్వర్లుగారు వచ్చారు. విశాఖపట్నంలో ప్రముఖ సంఘ సేవకులు గోపాలశాస్త్రిగారు - అతి బీద పిల్లలకు స్కూలు పెట్టి, భోజనాలు రోజూ పెట్టి కొన్ని వందల మందికి విద్య పంచిపెట్టారు ఎన్నో సంవత్సరాలుగా. ఆయనే స్కూలు నడపటం, ఉపాధ్యాయులకు జీతాలు కూడా తన సొంత డబ్బే ఇచ్చేవారు. మద్రాసు నుండి వచ్చిన ప్రముఖ కళాపోషకులు శాస్త్రిగారు, వారి స్నేహితులతో వస్తే, వారిని గూడా విజయవాడ హోటల్‌లో ఉంచి, వారి సౌకర్యాలన్ని చూచి, పలు కార్లు ఏర్పాటు చేసి అవనిగడ్డకు రప్పించారు అందరిని, శ్రమ ఎరుగని మండలి బుద్ధప్రసాద్‌గారు. అవనిగడ్డలో అన్ని కార్లలో వెళ్ళిన వారందరం, దుప్పట్లు ప్రతి గ్రామంలో పంచాం ఒక్కొక్కరం. జనం, దివిసీమ గ్రామాల్లో బారులు తీరి నిల్చున్నారు. మేము ప్రతి ఒక్కరికి పంచిపెట్టాం దుప్పట్లను. ఆ అనుభూతి మా అందరిని

కదిలించింది. నాకు అది మొదటిసారి గనుక, జీవితమంతా జ్ఞాపకం ఉంటుంది. కానీ బుద్ధప్రసాద్‌గారు ఎన్నో సంవత్సరాలుగా అలానే చేస్తున్నారు. ఎంత దయార్ధ్ర హృదయులో తండ్రి మండలి కృష్ణారావుగారిలా ఈయన కూడా. అసలు వారి కుటుంబ సభ్యులందరూ అలాంటి వారే అంటే నమ్మండి. బుద్ధప్రసాద్‌గారికి ఉన్న సుపుత్రుడూ అలాంటి వాడే. వారి కుటుంబంలో కొంతమందిని నేను బాగా ఎరుగుదును కనుక ఇలా వ్రాయగలుగుతున్నాను.

ఆంధ్రప్రదేశ్‌లో పెద్ద పెద్ద సభల్లో, ఎన్నోసార్లుగా నన్ను మాట్లాడించారు బుద్ధప్రసాద్‌గారు. నాకే కాదు ఎవరికైనా సరే అలాంటి అవకాశాల్ని ఇచ్చేటటువంటి సముద్రమంత విశాల హృదయులు, కరుణామయులు. ఎంత మందికి సహాయాలు చేశారో నాకు తెలుసు. తండ్రిని మించిన కొడుకు అంటే అలనాడు వెంగళరావుగారి ప్రభుత్వంలో విద్యాశాఖా మంత్రిగా ఉన్న మండలి కృష్ణారావుగారు ఎంత గొప్ప పేరు తెచ్చుకున్నారో రచయితలకు, చిత్రకారులకు, సంగీత, నృత్య కళాకారులకు, విద్యా సంస్థలకు ఎనలేని సహకారాలు చేస్తూ జీవితాన్ని ప్రజాక్షేమానికే ఉపయోగించారో, అలానే ఈనాడు మండలి బుద్ధప్రసాద్‌గారు కూడా– ఒకే ఒక వ్యక్తిగా కొన్ని దశాబ్దాలుగా రెండు తెలుగు రాష్ట్రాలలో ఉన్న కళాకారులందరికీ సహాయకారులుగా ఉంటూ, అండగా ఉన్నారు దశాబ్దాల తరబడి. ఏక కంఠంతో ఈ సృజనాత్మక కళాకారులందరు చెప్పేది, ఒకే ఒక్క వ్యక్తి పేరు – అది శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు. వీరిని కలిసిన వారందరు ధన్యులు – అలానే అందరిలా నేనున్నూ నా జీవితమంతా ఆదర్శపురుషులుగా గుర్తించి మనసులో దాచుకున్న వ్యక్తులు ఇద్దరే ఇద్దరు– తండ్రీ కొడుకులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు, శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు.

నా ఈ చిన్ని రచనను, అలోలాంతరాలాలలో అన్న కవితా సంపుటిని శ్రీ మండలి కృష్ణారావుగారికి అంకితం చేయడం అన్న అవకాశం నాకు కలిగినందుకు, ఎంతో ఎంతో అనందంతో, కృతజ్ఞతతో నా మనస్సు నిండిపోతున్నది.

నాకు అత్యంత ఆప్తులైన, నేను ఎప్పుడు పిలిచినా పలికి నాకు సర్వదా కొండంత అండగా ఉన్న శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

మండలి వారి కుటుంబాన్ని భగవంతుడు ఆయురారోగ్యాలతో ఆశీర్వదించాలని ప్రార్థిస్తూ, వారి సేవలకు తెలుగు వారు కృతజ్ఞులని తెలియజెప్పుతూ – సెలవు.

★ ★ ★



ప్రపంచ తెలుగు మహాసభలలో శ్రీ యస్.వి. రామారావుని సత్కరిస్తున్న
శ్రీ మండలి వెంకట కృష్ణారావు

# తెలుగుదనం మూర్తీభవించిన గాంధేయవాది
# ఎంవి కృష్ణారావు

**- కె.రామచంద్రమూర్తి**

'మూర్తిగారూ, నేను గాంధీగారిని చూడలేదనే బాధ చాలాకాలం ఉండేది. కృష్ణారావుగారిని కలుసుకున్న తర్వాత ఆ బాధ పోయింది" అన్నారు దర్శకరత్న దాసరి నారాయణరావుగారు. 'ఉదయం' పత్రిక సారథిగా ఆయనా, ఆ పత్రికకు విజయవాడ ఎడిషన్ బాధ్యుడిగా నేనూ మండలి వెంకట కృష్ణారావుగారితో కలసి గడిపిన క్షణాలను గుర్తు చేసుకుంటూ దాసరి సందర్భం వచ్చినప్పుడల్లా ఆయన గురించి ప్రస్తావించేవారు. కృష్ణారావుగారి నిరాడంబర వ్యక్తిత్వం, వినయశీలత, సేవాభావం, సకారాత్మక దృక్పథం ఆయనను బాగా ఆకట్టుకున్నాయి.

నాకు నా చిన్నతనంలోనే ఎంవి కృష్ణారావుగారు తెలుసు. నేను బెంగళూరులో ఆంధ్రప్రభలో సబ్-ఎడిటర్ గా పని చేస్తున్న రోజులలో (1976-79) కృష్ణారావుగారు జలగం వెంగళరావు కేబినెట్ లో విద్యా, సాంస్కృతిక వ్యవహారాల మంత్రి. తరచు ఏదో ఒక పని మీద బెంగళూరు వచ్చేవారు. కుమారకృప గెస్ట్ హౌస్ లో దిగేవారు. హైదరాబాద్ లో బయటదేరడానికి ముందే నాకు ఫోన్ చేసే వారు. ఆయన బెంగళూరులో ఉన్నంతకాలం నేను ఆయనతోనే ఉండేవాడిని.

బెంగళూరులో ఆంధ్రప్రభకు ప్రత్యేకించి విలేఖరులు ఎవ్వరూ లేరు. నేనే సబ్ ఎడిటర్ గా పని చేస్తూనే విలేఖరిగా కూడా కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలకు హాజరవుతూ ఉండేవాడిని. మా అసిస్టెంట్ ఎడిటర్లు నాగరాజుగారూ, పుల్లయ్యగారూ నన్ను ప్రోత్సహించేవారు. చిక్కమగళూరు ఉపఎన్నికలో ఇందిరాగాంధీ పోటీ చేసినప్పుడూ, డాక్టర్ చెన్నారెడ్డి ముఖ్యమంత్రి హోదాలో నందీహిల్స్ సందర్శించినప్పుడూ నేనే వెళ్ళి వార్తలూ, వ్యాఖ్యలూ రాసేవాడిని. నాటి కర్ణాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్స్ ని ఇంటర్వ్యూ చేయడం, అడ్వాణీని జైలులో పలకరించి వార్త రాయడం వంటి పనులు చేస్తూ ఉండేవాడిని. ఆంధ్రప్రదేశ్ నుంచి ప్రముఖులు ఎవరు వచ్చినా వారిని కలుసుకోవడం, వార్తలు రాయడం నా బాధ్యతగా ఉండేది. ముఖ్యంగా కృష్ణారావుగారు వచ్చినప్పుడు నాకు ఒక మంత్రి లేదా రాజకీయ నాయకుడు వచ్చినట్టు కాకుండా ఒక ఆత్మబంధువు వచ్చినట్టు ఉండేది. మృదుభాషి, మితభాషి అయిన కృష్ణారావుగారు నాతో

మాత్రం గంటలకొద్దీ మాట్లాడేవారు. కలసి భోజనం చేసేవాళ్ళం. చిన్నతనంలోనే తాను విద్యార్థినాయకుడిగా, యూత్ కాంగ్రెస్ నేతగా, లోక్ సభ సభ్యుడిగా, పీవీ నరసింహారావు హయాంలో 1972 అవనిగడ్డ నుంచి పోటీ లేకుండా ఎన్నికైన ఎంఎల్ఏగా, పీవీ మంత్రివర్గంలో సాంఘిక సంక్షేమం, మత్స్య శాఖల మంత్రిగా, అనంతరం జలగం వెంగళరావు మంత్రివర్గ సభ్యుడిగా తాను చేసిన, చేస్తున్న కార్యక్రమాలు, వాటి వెనుక ఉన్న లక్ష్యాలు, తార్కికత, కార్యకారణ సంబంధాల గురించీ వివరించేవారు. మాకు ఇద్దరికీ ఇష్టమైన అంశం గాంధీమార్గం. క్విట్ ఇండియా ఉద్యమం గురించీ, ఖద్దరు ధారణ గురించీ, గాంధేయ విలువల గురించీ మనస్ఫూర్తిగా మాట్లాడేవారు. తనపైన గాంధీగారి ప్రభావం గురించి మాట్లాడటం ఆయనకు ఇష్టమైన విషయం. హైదరాబాద్ లో ఆయనకు అంత తీరిక దొరికేది కాదేమో. బెంగళూరులో వచ్చిన పని చూసుకున్న తర్వాత తిరిగి హైదరాబాద్ కు బయలుదేరే వరకూ ఆయన వెంట నేను ఒక్కడినే ఉండేవాడిని. రాధాకృష్ణరాజు వంటి తెలుగు సంఘాల నాయకులు వచ్చి వెడుతూ ఉండేవారు.

బెంగళూరు నుంచి బదిలీపైన విజయవాడ వచ్చిన నేను ఆయిదేళ్ళు ఆంధ్రప్రభలో పని చేసి 1984లో ఉదయం విజయవాడ ఎడిషన్ బాధ్యుడిగా చేరాను. ఆ సమయంలో కృష్ణారావుగారిని విజయవాడలో తరచుగా కలుసుకుంటూ ఉండేవాడిని. ఆయన కోట్ల విజయభాస్కరరెడ్డిగారి కేబినెట్ లో సహకారమంత్రిగా ఉండేవారు. విద్య, సాంస్కృతిక వ్యవహారాల శాఖల మంత్రిగా ఉన్నప్పుడు కృష్ణారావుగారికి తనకు ఇష్టమైన పనులు చేసే అవకాశం వచ్చింది. జలగం వెంగళరావుగారి ప్రోత్సాహం ఉండేది. ప్రపంచ తెలుగు మహాసభలను 1975లో నిర్వహించడంలో మండలివారిది ప్రధాన పాత్ర. ఆ సభలు చిరస్మరణీయంగా జరిగాయి. శ్రీశ్రీ హడావిడి సరికొత్త కోణాన్ని జోడించింది. 1975లోనే కృష్ణారావుగారు నాగపూర్ లో జరిగిన ప్రపంచ హిందీ మహాసభలకూ, మారిషస్ లో మరుసటి సంవత్సరంలో జరిగిన హిందీ మహాసభలకూ హాజరైనారు. తెలుగంటే ప్రాణం. తెలుగువారంటే ఇష్టం. తెలుగుదనం మూర్తీభవించిన పరమ గాంధేయవాదిగా ఆయనను అభివర్ణించవచ్చు. మాతృమూర్తినీ, మాతృభూమినీ, మాతృ భాషనూ ఆరాధించే మనస్తత్వం ఆయనది. దివిసీమ అంటే ప్రగాఢమైన ప్రేమ. దివిసీమను 1977లో సముద్రకెరటాలు ఉవ్వెత్తున లేచి కబళించినప్పుడు ఆయన చలించిపోయారు. అపారమైన ప్రాణనష్టం, ఆస్తినష్టం జరిగింది. అప్పుడు ప్రతిపక్షంలో ఉన్న ఇందిరాగాంధీ, నాటి కేంద్రమంత్రి రాజనారాయణ్, మరెందరో వచ్చారు. బయటనుంచి వచ్చినవారు వెళ్ళిపోతారు. అక్కడే ఉంటూ, నిత్యం ప్రజల మధ్యన జీవిస్తున్న కృష్ణారావుగారు గుండె నిండా విషాదం నింపుకొని ఏకోన్ముఖదీక్షతో కర్తవ్యాన్ని నిర్వహించారు. రేయింబవళ్ళూ తన ప్రజలను కాపాడటానికీ, వారికి పునరావాసం కల్పించడానికీ శక్తివంచనలేకుండా పాటుపడ్డారు. అందుకే ఆయనను దివిసీమ అక్కున చేర్చుకున్నది.'దివిసీమ గాంధీ' అని పిలుచుకుంది. తెలుగు భాషాభిమానులు మనసారా ప్రేమించారు. బ్రిటన్, అమెరికా వెళ్ళి తెలుగువారి జీవితాలను చూసి, వారితో సంభాషించి వచ్చారు. అవనిగడ్డలో గాంధీక్షేత్రాన్నిస్థాపించారు. తాను కోరుకున్న విధంగా, తన ఆశయాలకు అనుగుణంగా జీవించిన ధన్యజీవి ఆయన.



కృష్ణారావుగారు అదృష్టవంతుడు. తాను జీవిత పర్యంతం ఏ విలువలకోసం పాటుపడ్డారో, ఏ ఆదర్శాలను శ్వాసించారో, ఏ విధానాలను విశ్వసించారో, ఏ భాషనూ, ఏ సంస్కృతినీ ఆరాధించారో అవే లక్షణాలను పుణికి పుచ్చుకున్న బుద్ధప్రసాద్ గారిని కొడుకుగా కన్నారు. ఈ దేశంలో ఎందరో తండ్రులు కష్టపడి సంపాదించిన కీర్తినీ, ఆస్తినీ పిల్లలకు అప్పగించి ఈ లోకం విడిచి తమ దారిన తాము వెళ్ళిపోతారు. పిల్లలు అన్నిటినీ స్వీకరించి తమ ధోరణిలో తాము ప్రయాణం చేస్తుంటారు. కానీ బుద్ధప్రసాద్ గారు మాత్రం తండ్రి నోట్లోంచి ఊడిపడినట్టు ఆయన మనసెరిగి తన జీవితాన్ని దిద్దితీర్చుకున్నారు. ఆయన అడుగులలో అడుగులు వేస్తూ నడిచారు. తండ్రికి తగిన తనయుడనిపించుకున్నారు. కృష్ణారావుగారిలాగానే బుద్ధప్రసాద్ గారు కూడా తెలుగు భాషానురక్తినీ, సాంస్కృతిక సంస్కారాన్నీ, సేవాతత్పరతనూ, నీతీనిజాయితీలనూ నిత్యజీవితంలో ప్రదర్శిస్తూ ఆదర్శవంతంగా జీవిస్తున్నారు. అధికారంలో ఉన్నా లేకపోయినా విజయవాడలో ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహిస్తున్నారు. మంత్రిగా, శాసనసభ ఉపసభాపతిగా పని చేసినా తన ప్రత్యేకతను నిలబెట్టుకున్నారు. తక్కిన రాజకీయనాయకులకేంటే భిన్నంగా తన జీవితాన్ని పరిశుభ్రమైన రీతిలో ఆదర్శవంతంగా నిర్మించుకున్నారు. తండ్రి పేరు ప్రతిష్ఠలను ఇనుమడింపజేస్తూ, ఆయన జీవిత విలువలను కొత్తతరాలకు తెలియజెబుతూ వారి వర్ధంతి సందర్భంగా ప్రముఖులను ఆహ్వానించి పురస్కారాలతో సత్కరిస్తున్నారు. గాంధీ జీవితాన్ని అధ్యయనం చేస్తూ గాంధీ ప్రబోధాలకు అంకితమైన జర్మనీ దేశస్థులు క్రిస్టియర్ బార్ టార్ఫ్ ను ఆహ్వానించి గాంధీక్షేత్రంలో సన్మాన కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడం ఏ యేడాది వర్ధంతి కార్యక్రమం ప్రత్యేకత. దీనివెనుక ఎంతో ఆలోచన, శ్రమ, తపన ఉన్నాయి. తన జీవితాన్ని సార్థకం చేసుకుంటున్న బుద్ధప్రసాద్ గారికీ, ఆయన తోబుట్టువులకూ, సంతానానికీ ఈ సందర్భంగా శుభాభినందనలు.

★ ★ ★

# మండలి వెంకట కృష్ణారావు : సంఘశీలత - సంస్కరణ దృష్టి

-*డా. సుందర్ కొంపల్లి*, చరిత్రకారుడు, విమర్శకుడు

రాజకీయ నేతగా ఎంతోమందికి, ముఖ్యంగా తెలుగువారికి పరిచయమున్న మండలి వెంకట కృష్ణారావుగారిలో అపరిమితమైన నంఘు సంస్మరణ ప్రియత్వముండేది. సామాజికమార్పుకై తపన వుండేది. ఆయన తన జీవితంలో ఈ విలువలను నిలబెట్టుకున్నారు, వాటి కొరకు పాటుపడ్డారు. ఇక్కడొక ప్రశ్న ఉదయిస్తుంది. ఆయన తరానికి చెందిన నాయకులందరూ, అంటే 20వ శతాబ్ది తొలి దశకాల్లో జన్మించి, రాణించిన వారు, ఇదే రకమైన వ్యక్తిత్వం కలిగి వున్నారా? దీనికి సమాధానం కాదనే వస్తుంది. కాదని చెప్పడం మిగతా నాయకులను కించపరచడమో, తక్కువ చేయడమో కాదు. ఎవరి దృష్టి వారిది. ఇక్కడ మనం మూడు విషయాలను గమనించాలి.

i. 20వ శతాబ్ది తొలినాళ్ళు స్వాతంత్రోద్యమానికి పూర్తిగా అంకితం. అధిక భాగం మహాత్మాగాంధి నాయకత్వంలో పోరాడిన వారే! మండలి కృష్ణారావుగారి వ్యక్తిత్వం గాంధేయభావాల్లో వికసించింది. మహాత్మాగాంధికి ఉద్యమం ఎంత ప్రధానమో, సంఘనిర్మాణ కార్యక్రమం కూడా అంతే ప్రధానం. స్వాతంత్ర్యం రాక పూర్వం కాంగ్రెస్ కార్యకర్తలు, నాయకులు – అందరూ రెంటిలో ఉండేవారు. కానీ 1947 తర్వాత చాలా మంది అధికార కాంగ్రెస్ రాజకీయాలకు పరిమితమైనారే కాని, సంఘనిర్మాణం, సామాజిక మార్పులపై దృష్టి సారించలేదు. దేశంలో "రాజకీయ గాంధేయులు", "నిర్మాణాత్మక గాంధేయులు"గా రెండు వర్గాలు ఉద్భవించాయి. గాంధీతత్వాన్ని నిర్మాణాత్మక సంఘ దృష్టిని సమపాళ్ళలో మేళవించి, జీవితాంతం కృషిచేసిన నాయకులు రాశిలో చాలా తక్కువ. ఈ రాశివారే మండలి కృష్ణారావు. ఆయన రాజకీయం కేవలం కాంగ్రెస్ రాజకీయం కాదు. ఆయన చేపట్టి నిర్వహించిన కార్యక్రమాలు ఆయనలోని సంఘచాలతను, సంస్కరణ ప్రియత్వాన్ని, సామాజిక సమానత్వం కొరకు తపనను వెల్లడిస్తాయి. క్లుప్తంగా చెప్పాలంటే స్వాతంత్ర్యానంతర గాంధేయానికి ఆయన అసలు సిసలైన సాంఘికరూపం. ఆయన వృత్తి రాజకీయం కావచ్చు గాని, ప్రవృత్తి మాత్రం సాంఘికం. కానీ, ఆయన రాజకీయ నాయకత్వమే ఎక్కువగా ప్రకాశించింది. కారణం, అధికారం, పదవులు.

ii. 20వ శతాబ్ది తొలి దశకాల్లో తెలుగు సమాజంలో కులాల కుంపట్లు రాజుకున్నాయి. కులసంఘాలు బాగా చైతన్యంగా పనిచేశాయి. కులానికి కోటలు కట్టిన కాలమది. రాజకీయంగా జస్టిస్ పార్టీ బ్రాహ్మణేతర కులాలను కలుపుకొని, అధికారం దిశగా పయనించింది. బ్రాహ్మణేతరుల్లోని అగ్రకులాల అగ్రజులంతా జస్టిస్ పార్టీ పంచనచేరారు. వీరి ప్రభావం సమకాలీన సమాజంలో బాగా ఉండేది. దివిసీమ ప్రాంతం నుండి కూడా నాయకులు ఉద్భవించారు (చల్లపల్లి జమిందారు ఒక ఉదాహరణ). మండలి కృష్ణారావుగారు యుక్తవయస్సులో అడుగిడే నాటికి అవిష్టుతమైన సాంఘిక పరిస్థితులివి. పిన్నవయస్సులోని కృష్ణారావుగారు ఈ ప్రభావాలకు సులభంగా లొంగిపోవాల్సిన అంశమిది. కానీ ఆయన విజ్ఞత ప్రదర్శించారు. గాంధేయ రాజకీయాన్ని ఎంచుకున్నారు. కులరాజకీయాన్ని విస్మరించారు. తరువాతి కాలంలో కూడా ఆయన కాపు రాజకీయాలకు అతీతంగా ఎదిగారు. జీవితాంతం ఆయన ప్రముఖ గాంధేయులు ప్రభాకర్‌జీ, గోరా, లవణం తదితరులతో కలసి అనేక సాంఘిక కార్యక్రమాలు నిర్వహించారు. ఆయన సంఘదృష్టి, సంస్మరణ భావాలు ఏనాడో కులాన్ని అధిగమించాయి. రాజకీయనేతగా, మంత్రిగా తదనంతర కాలంలో ఆయన భావాలు సంస్కరణ, మార్పు, అభివృద్ధి చుట్టూ పరిభ్రమించాయే తప్ప, పాక్షిక ధోరణులకు లొంగిపోలేదు.

iii. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత దేశమంతటా కాంగ్రెస్ ప్రభుత్వాలే ఏర్పడ్డాయి. దేశంలోని సంస్థానాధీశులు, జమీందార్లు, వ్యాపారులు, కులీనులు - ఇలా చాలామంది కాంగ్రెస్ రాజకీయాల్లో ఉన్నారు. పదవులు అలంకరించారు. అనేకులు తమ రాజకీయాలతో పాటుగా వివిధ వ్యాపారాలు, లాభాలనార్జించే కార్యక్రమాలు కలిగి ఉండేవారు. అదే సమయంలో కొద్దిమంది సామాన్య కార్యకర్తలు కూడా నాయకత్వ స్థానానికి ఎదిగారు. వీరందరూ తు.చ. తప్పకుండా గాంధేయవాదాన్ని పాటించే వ్యక్తులు. గాంధేయ నైతికతను వారసత్వంగా ఎంచుకున్న సామాన్య నాయకులు. సమకాలీన సంఘసంస్కర్త లవణం మాటల్లో చెప్పాలంటే దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తొలి కాలం "సక్రియాత్మక నైతికత దశ (Age of Active Morality). గాంధీగారు ప్రవచించిన నిరాడంబరత్వం, నిజాయితీ, సచ్ఛీలత, నిర్మాణ కార్యక్రమం మొ॥ వాటికి అతి కొద్దిమంది కాంగ్రెస్ నాయకులు, మంత్రులు కట్టుబడి ఉన్నారు. అలాంటి వారిలో మండలి కృష్ణారావుగారు తెలుగు సమాజంలో ప్రముఖులు. ఆయనలా అలా కొద్దిమంది కాంగ్రెస్ నాయకులు మాత్రమే ఉండగలిగారు. సాధారణ రైతు కుటుంబంలో పుట్టిన ఆయనకు ఉపాధ్యాయుడైన తన తండ్రే ఆదర్శం. తన తండ్రి నుంచే ఆయన సంస్మరణశీలతను పొందారు. తాను కార్యకర్తగా వున్నా, అధికారంలో వున్నా మార్పు భావాలను కలిగివుండేవారు. తన చివరి శ్వాసవరకు ఆయన నమ్మిన సిద్ధాంతాలను వీడలేదు.

మండలి కృష్ణారావుగారి వ్యక్తిత్వంలోని సాంఘిక కోణం విమర్శకుల దృష్టిలో అనుకున్నంత స్థాయిలో పడలేదు. కృష్ణారావుగారి మానసిక దృక్పథం సాంఘిక మార్పు. ఆయన ఏ పదవిలో వున్నాతన సంస్మరణశీలతను కోల్పోలేదు. కార్యకర్తగా, నాయకునిగా, మంత్రిగా ఆయన చేపట్టి నిర్వహించిన కార్యక్రమాలే దీనికి సజీవ సాక్ష్యాలు. నేరస్తుల సంస్మరణ, వెనుకబడిన తరగతుల అభివృద్ధి కార్యక్రమాలు, దివిసీమ ఉప్పెన సమయంలో కులాతీతంగా సంఘసేవ, ప్రపంచ తెలుగు మహాసభలు మొ? విషయాలందు ఆయన సంఘ దృష్టి ప్రస్ఫుటంగా తెలుస్తుంది.

## II

సాంఘికాభివృద్ధి రంగంలో, ముఖ్యంగా సంఘసంస్మరణల విషయంలో, 19వ శతాబ్దానికి, 20వ శతాబ్దానికి చాలా తేడా ఉంది. 19వ శతాబ్ది తొలినాళ్ళలో వలసవాద బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలోని తొలి తరం సంఘసంస్కర్తల కార్యక్రమాలకు చేతనైనంత సహాయం అందించింది. కానీ క్రమంగా ఈ తోడ్పాటు అవిరైపోయింది. భారత ప్రజలందు సంఘచేతన ఎక్కువైతే వలసాధికారానికి ముప్పువాటిల్లగలదనే భయం ప్రభుత్వానికుండేది. దీనివల్లనే అది వెనకడుగువేసింది. తన రాజకీయాధికారంపైనే దృష్టిని నిలిపింది. సాంఘిక మార్పుకై సంస్కర్తలు వ్యక్తిగతంగా కృషి చేసేవారు. స్థానికులు కొందరు సహకరించేవారు. క్లుప్తంగా 19వ శతాబ్ది నేపథ్యమిది. 20వ శతాబ్దానికి పరిస్థితులు మారాయి. ఉవ్వెత్తున ఎగసిన జాతీయ స్వాతంత్రోద్యమం ప్రజలను విపరీతంగా ఆకర్షించింది. అనేక మందితో కలిసి సంస్కర్తలు సైతం ఉద్యమంలో భాగమైనారు. సంస్మరణ కృషి ఫలాలు ప్రస్తుతం స్వాతంత్రోద్యమంలో అంతర్భాగాలైనాయి.

భారతదేశానికి 1947లో స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత నూతన పరిస్థితి ఆవిష్కృతమైంది. సర్వసత్తాక లౌకిక ప్రజాస్వామ్య దేశంగా భారతదేశాన్ని ప్రకటించారు. ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడినపుడు ప్రజలకు సంబంధించిన అంశాలన్నీ ప్రభుత్వ పరిధిలోనికే వస్తాయి. ఈ సమయంలో రెండు ప్రధానమార్పులు సంభవించాయి. ఒకటి-సంస్కరణ, అభివృద్ధి కార్యక్రమాలను ఇక ప్రజాస్వామిక ప్రభుత్వమే చేపడుతుందనే భావం విస్తరిల్లింది. దానితో సాంఘిక మార్పుపై దృష్టి సన్నగిల్లింది. రెండు- ఆనాటి పరిస్థితుల ప్రభావం దృష్ట్యా ప్రభుత్వం ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలపై ప్రధానంగా దృష్టి సారించింది. సంస్మరణ, మార్పు అనేవి మందగించాయి. ఈ కార్యక్రమాలను చేపట్టాలంటే నిబద్ధత, సహనం, సచ్ఛీలతలుండాలి. అధికార లాలస ఉండరాదు. అంటే, అభివృద్ధి కార్యక్రమాలను సంస్మరణ దృష్టితో రంగరించి ముందుకు తీసుకొని వెళ్ళాలి. అధికార రాజకీయాలకు అలవాటుపడితే సంఘదృష్టితో కార్యక్రమాలు నిర్వహించడం కష్టసాధ్యం. ఇచట కాంగ్రెస్ వాదులు (అంటే గాంధేయ సిద్ధాంత వారసులని అర్థం చేసుకోవాలి) కొందరు రాజకీయాల నుండి పూర్తిగా దూరం జరిగి,

గాంధేయ నిర్మాణాత్మక కార్యక్రమాలను తాము స్థాపించిన స్వచ్ఛంద సంస్థల ద్వారా కొనసాగించారు.

మరోవైపున, అతి కొద్దిమంది కాంగ్రెస్ వాదులు రాజకీయాధికారాన్ని, పదవులను స్వీకరించి కూడా గాంధీ తత్త్వాన్ని విడకుండా తమ కార్యక్రమాలను నిర్వహించేవారు. రాజకీయ నాయకత్వానికి, సాంఘిక నాయకత్వానికి మధ్యన వీరు సమతుల్యతను సాధించే ప్రయత్నంచేసి, విజయం సాధించారు. ఇలాంటి నాయకులు చాలా అరుదు. అలాంటి అరుదైన జాతి వ్యక్తే మండలి కృష్ణారావుగారు. తన రాజకెయ్యాన్ని, అధికారాన్ని సంఘ నిర్మాణానికి, మార్పుకు అనుసంధానించి అవిరళ కృషి చేశారు. ఒకవేళ తన అధికార పదవికి ఏవైనా పరిమితులుంటే, ఆయన వ్యక్తిగత స్థాయిలో కార్యక్రమ సాఫల్యతకు కృషిచేశారు. దీనికి ప్రత్యక్ష ఉదాహరణే ఆయన అవనిగడ్డలో స్థాపించి, నిర్వహించిన గాంధీక్షేత్రం. నమ్మిన గాంధేయ సిద్ధాంతానికి, సంస్కరణాత్మక కార్యక్రమాలకు మధ్యన ఇంతలా అవినాభావ సంబంధాలను ఏర్పరచి, సంఘంలో కృషిచేసిన రాజకీయ నాయకులు తెలుగు సమాజంలో అత్యంత అరుదు.

ఈ చారిత్రక ఘనకార్యాన్ని సాధించిన వ్యక్తి మండలి కృష్ణారావు. తమిళనాట కామరాజుగారిది ఎల్లపుడూ "చూద్దాం" అనే దృష్టి తెలుగునాట మండలి కృష్ణారావుగారిది అన్ని వేళలా "చేద్దాం" అనే దృష్టి. ప్రఖ్యాత మహిళా సంఘసంస్కర్త హేమలతా లవణం మాటల్లో చెప్పాలంటే మండలి కృష్ణారావుగారిది అత్యంత సునిశితమైన సంఘదృష్టి. ఆయన కార్యక్రమాలను విశ్లేషిస్తే ఆయన రాజకీయ వ్యక్తిత్వం కంటే సాంఘిక వ్యక్తిత్వమే వాసిలో విశిష్టమని మనకు తప్పకుండా అవగతమౌతుంది. ఆయన జీవితాన్ని కూలంకషంగా పరిశీలిస్తే ఆయన ఎదుగుదల, వ్యక్తిత్వ వికాసంలో మూడు ప్రధాన దశలు కనిపిస్తాయి.

1. పునరంకిత దశ (1942 - 1957)
2. పరిపుష్ట దశ (1957 - 1977)
3. పరివ్యాపిత దశ (1977 - 1997)

## III

మండలి కృష్ణారావు అనే యుక్తవయస్సు వ్యక్తి పూర్తిగా గాంధేయుడై, తన కార్యక్రమాలను నిర్దేశించుకున్న దశే పునరంకిత దశ (1942 - 1957). ఈ సమయంలోనే ఆయన జస్టిస్ పార్టీ కుల రాజకీయాలను విస్మరించి, జాతీయవాదిగా, మానవవాదిగా ఎదిగారు. ఈ ఎదుగుదలకు సిసలైన తాత్విక నేపథ్యం గాంధీ సిద్ధాంతం. మరి కొంత కారణం, తన తండ్రి శిక్షణ కూడా. 1942 క్విట్ ఇండియా ఉద్యమం నాటికి మండలి కృష్ణారావు పూర్తి గాంధేయునిగా మారి, స్వాతంత్రోద్యమబాట పట్టారు. నిఖార్సయిన గాంధేయునిగా ఎదిగారు. గాంధి సిద్ధాంతాలను తు.చ. తప్పకుండా

పాటించడం ప్రారంభించారు. గాంధి నిర్మాణాత్మక కార్యక్రమ స్ఫూర్తిని నరనరాన నింపుకున్నారు. ఈ కారణం చేతనే ఆయన గాంధేయుల్లో ప్రత్యేకంగా కనిపించేవారు. ఆయన రాజకీయానికి మూలం గాంధి. ఆయన కార్యక్రమాలకు మూలం సంఘ దృష్టి. అయన ఆలోచనలకు మూలం సంస్కరణ-అభివృద్ధి కార్యక్రమాలు. 1947లో దేశానికి స్వాతంత్ర్యం వచ్చే నాటికి మండలి కృష్ణారావుగారికి తన భవిష్య కార్యక్రమాలపై పూర్తి అవగాహన ఉంది.

స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత కాంగ్రెస్ రాజకీయంలో ఒక మౌలిక మార్పు వచ్చింది. దేశ పునర్నిర్మాణానికి కాంగ్రెస్ వాదులందరూ నిర్విరామ కృషి చేయాలని గాంధీ సంకల్పం. దేశాన్ని ప్రేమించే వారందరికీ ఆయన అదే పిలుపునిచ్చాడు. మరోవైపు కాంగ్రెస్ పార్టీ దేశమంతటా ఎన్నికల్లో గెలిచి అధికారంలోనికి వచ్చింది. క్రమంగా కాంగ్రెస్ నాయకులందరూ అధికార రాజకీయాలకు అలవాటుపడి పోసాగారు.

1948లో గాంధిజీ చనిపోయిన తర్వాత నాయకులను హెచ్చరించి, నిర్దేశంచేసే పరిస్థితి లేదు. ఈ సమయంలో గాంధీ నిర్మాణ కార్యక్రమాలను ముందుకు తీసుకువెళ్ళిన వ్యక్తులు, సంస్థలు ప్రధాన స్రవంతి రాజకీయాలకు దూరంగా ఉన్నారు. వినోబాభావే, ప్రభాకర్‌జీ వంటి వారు పూర్తిగా సర్వోదయానికి, గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలకు అంకితమై పనిచేశారు. వినోబాభావే భూదాన (ఆంధ్ర), గ్రామదాన (ఒరిస్సా) ఉద్యమాలు దీనికి నిలువెత్తు తార్కాణాలు. అదే విధంగా దేశవిదేశాల్లో స్థిరపడిన ప్రైవేటు వ్యక్తులు కూడా గాంధీజీ స్ఫూర్తితో సాంఘికాభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించారు. కొంతమంది గ్రామనిర్మాణం కొరకే విదేశాలను వదలి మాతృదేశానికి వచ్చారు. స్వచ్ఛంద సంస్థలను స్థాపించి గాంధిజీ స్ఫూర్తితో పనిచేశారు. ఉత్తర కోస్తాంధ్రలో ఆవిర్భవించిన భాగవతుల ఛారిటబుల్ ట్రస్ట్ దీనికొక ఉదాహరణ. ఇక చివరగా, కాంగ్రెస్ నాయకులు. అధికారంలోనికి వచ్చిన కాంగ్రెస్ నాయకుల్లో అతి కొద్దిమంది మాత్రమే తమ రాజకీయాలకు అతీతంగా గాంధిజీ సంఘనిర్మాణ కృషిని కొనసాగించారు. అధికారంలో ఉంటూ కూడా వీరు గాంధేయ సిద్ధాంతాలను మరువలేదు. ప్రజాప్రతినిధులుగా, మంత్రులుగా కొనసాగుతూ కూడా నిర్మాణ కార్యక్రమాల నేపథ్యాన్ని విస్మరించలేదు. అధికారానికి అలవాటు పడిపోతున్న కాంగ్రెస్ రాజకీయంలో ఇదొక పునరంకిత కార్యక్రమం. మౌలిక కాంగ్రెస్ వాదులుగా, గాంధీజీ అనుచరులుగా అతికొద్ది మంది రాజకీయులు ఇలా స్వాతంత్ర్యానంతరం తమను తాము గాంధేయ చింతనకు, నిర్మాణ కార్యక్రమాలకు అనుసంధానం చేసుకున్నారు. మండలి కృష్ణారావుగారు ఈ విషయంలో అగ్రగణ్యులుగా కనిపిస్తారు. ఇంతకు ముందే పేర్కొన్నట్లు, 1960 చివరినాటికి ఆయన "గాంధీ క్షేత్రం" పేరిట అవనిగడ్డలో ప్రత్యేక సంస్థను ప్రారంభించి, రాజకీయాలకు అతీతంగా, ప్రధాన స్రవంతి కాంగ్రెస్ రాజకీయానికి బాహ్యంగా తన నిర్మాణ కృషిని, సంస్కరణాభిలాషను కొనసాగించారు. ఈ పునరంకిత దశలో ఆయన సాధించిన

చారిత్రక విజయం దివిసీమలో పేద దళితులకు ప్రభుత్వ బంజరు భూమిని పంచడం. దీనిని ప్రభుత్వం సైనికులకు కేటాయిస్తే, మండలి కృష్ణారావుగారు దానిని వ్యతిరేకించి స్టే ఆర్డర్ తెచ్చి, ఆనాటి సంక్షేమశాఖ మంత్రి వేముల కూర్మయ్యగారితో మాట్లాడి ఆ భూమిని అనేక సంవత్సరాలుగా సాగుచేసుకుంటున్న పేద దళిత కుటుంబాలకు మంజూరు చేయించారు. గాంధీజీ నిర్మాణ కార్యక్రమ స్ఫూర్తికి పునరంకితమవడం మూలంగానే ఇది సాధ్యమైంది. ప్రఖ్యాత కవి బోయి భీమన్నగారి మాటల్లో చెప్పాలంటే మండలి కృష్ణారావు ఆశిస్తున్న ఫలసాయం సర్వమానవ సమసమాజం, సోషలిజం.

మండలి కృష్ణారావుగారి జీవితంలో రెండవ భాగమైన పరిపుష్ట దశ (1957-1977) చాలా ప్రత్యేకతలు సంతరించుకొంది. రాజకీయనేతగా ఆయన సాధించిన విజయాలకు సాక్ష్యం ఈ దశే! 1957వ సంవత్సరంలో మొట్టమొదటి సారిగా ఆయన మచిలీపట్నం నుండి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా లోక్‌సభకు ఎన్నికైనారు. పంచాయితి సమితి, జిల్లా పరిషత్, శాసనసభల్లో కూడా ఆయన ఈ దశలోనే ప్రవేశించారు. అనేక పదవులు అలంకరించారు. అనేక ప్రధాన సాంఘిక కార్యక్రమాలను చేపట్టారు. ఈ రెండు దశాబ్దాల కాలంలో ఆయన సాధించిన విజయాలు నేటికీ మైలురాళ్ళుగా మిగిలిపోయాయి. ఆయన నిర్మాణాత్మక దృష్టి సంఘ సంస్కరణాభిలాష స్పష్టంగా వ్యక్తమైనతీరు మనకు కనిపిస్తుంది. ఈ క్రింది కార్యక్రమాలు, వివరాలు గమనిస్తే మన విశ్లేషణ ఇంకా సులభతరం కాగలదు.

i. పూలదండల స్వీకరణను విసర్జించిన కార్యక్రమం చాలా ప్రత్యేకం. విజయవాడ నాస్తిక కేంద్రంలో గోరాగారు పూలదండల బదులు కూరగాయలను ఉపయోగించడం గమనించారు. కానీ దండ ఏదైనా ఆరాధనకు సూచన, అహంభావానికి మూలం. అనవసర ఖర్చు. కావున మండలి కృష్ణారావుగారు వీటన్నింటినీ ఏకకాలంలో విసర్జించారు. అలా చేసిన ప్రప్రథమ కాంగ్రెస్ మంత్రి ఆయన.

ii. మంత్రిగా సాధారణ ప్రజారవాణాను (బస్సులను) ఉపయోగించిన ప్రథమ కాంగ్రెస్ నాయకుడు కృష్ణారావుగారు. దీనిని పొదుపు చర్యల్లో భాగంగా ఆయన చేపట్టారు. అంతేకాక తన దగ్గర సిబ్బందిని కూడా తగ్గించుకున్నారు.

iii. సాంఘిక మార్పు కృషిలో భాగంగా ఆయన ప్రభుత్వం నిర్వహించే సాంఘిక సంక్షేమ వసతిగృహాల్లో విప్లవాత్మక మార్పులు తెచ్చారు. వాటికి శాశ్వత గ్రాంట్లను ఏర్పాటు చేశారు. సమకాలీనంలో అత్యంత వివాదాస్పద పత్రిక 'కమెండో' కూడా కృష్ణారావుగారి కృషిని ప్రశంసిస్తూ ఆయన్ను శ్రేయోరాజ్యంలో సమిష్టి కృషికి విలువనిచ్చే సోషలిస్టుగా పేర్కొంది.

iv. గాంధీజీ, వినోభాల స్ఫూర్తితో మండలి కృష్ణారావుగారు తనకున్న 7౦ ఎకరాల్లో ఐదు ఎకరాలను పేదలకు పంచారు. ఇదొక చారిత్రక సంఘటన. వ్యవసాయిక భారతదేశంలో ఆర్థిక సంబంధాలన్నీ భూసంబంధ విషయాలే! అలాంటి చోట కృష్ణారావుగారి నిర్ణయం సాధారణ విషయం కాదు. కాంగ్రెస్ రాజకీయాల్లో ఇదొక నూతన వరవడి. దీనితో బాటుగా ఆయన తన ఆస్తి వివరాలను బహిర్గతపరచి, సమాజం ముందు ఉంచారు. ఇది అనాటి రాజకీయాల్లో ఒక మేలి మలుపు.

v. ఆయనే సంస్కరణాభిలాషకు మచ్చుతునక 1972లో నిర్వహించిన సాంఘిక సంస్కరణల సదస్సు. దీనిలో ఆయన కీలక పాత్ర పోషించారు. ఈ సదస్సులో అనేక విషయాలపై చర్చ జరిగింది. ముఖ్యంగా సంస్కరణల అవశ్యకతపై సుదీర్ఘ చర్చలు నిర్వహించారు. ఈ సదస్సుల సందర్భంగానే మండలి కృష్ణారావుగారు ఒక చారిత్రక ప్రకటన చేశారు. కులాంతర (మతాంతర) వివాహం చేసుకున్నవారికి వెయ్యి రూపాయలు ఇవ్వాలని ప్రభుత్వం ఆలోచిస్తోందని ఆయన తెలిపారు. కులాంతర వివాహాలకు, కులనిర్మూలన భావాలకు ఇది దన్నుగా నిలువగలదని అనేకమంది భావించారు. ప్రభుత్వమే సంఘసంస్కరణల సదస్సు నిర్వహించడం అదే ప్రథమం. దానికి ప్రధాన కారకులు మండలి కృష్ణారావుగారు. ఆధునిక భారత రాజకీయాల్లో ఇదొక కొత్త కార్యక్రమం. ఆయన సమకాలికుడు గులాం యాసీన్ పేర్కొన్నట్లు రాజకీయ కులంలో ఒక గుణవంతుడు మండలి. మరో సమకాలీన ప్రముఖ పత్రిక, జమీన్ రైతు ఆయన్ను ఏకంగా లాల్‌బహదూర్ శాస్రిగారిలోని నీతి, నిజాయితి, నిబద్ధతలతో పోల్చింది.

vi. సమకాలీన సమాజంలో జరిగిన సాంఘిక సంస్కరణ కృషిలో ఆయన ప్రత్యక్ష భాగస్వామ్యం అనాటి రాజకీయ వాతావరణంలో అత్యంత నూతనం. ప్రముఖ సంఘ సంస్కర్తలు, హేమలత – లవణం దంపతులు గుంటూరు జిల్లా స్టువర్టుపురంలో చేపట్టి, విజయవంతంగా నిర్వహించిన నేరస్తజాతుల సంస్మరణ కృషిలో మండలి కృష్ణారావు చాలా ప్రముఖపాత్ర పోషించారు. నాటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రతినిధిగా ఆయన స్టువర్టుపురాన్ని ఎన్నోసార్లు వ్యక్తిగతంగా వచ్చి, గమనించారు. సంస్కరణ కృషికి తన పూర్తి సహకారాన్ని అందించారు. హేమలతా లవణంగారి మాటల్లో చెప్పాలంటే: ... వారిని నేరవృత్తి నుండి తప్పించడానికి ప్రత్యామ్నాయ జీవితోపార్జన కలిగించడానికి వారికి సామాజిక గౌరవం లభింపచేయుటకు ఆయన పూనుకొన్నారు. .... త్యాగమూ, నిరాడంబరత్వమూ సమాజసేవకు మూలస్తంభాలు. ఇవి శ్రీ మండలిలో శుభ్రంగా కనిపిస్తాయి. ఇది ఆయనకు, ఆయన సంస్కరణాభిలాషకు లభించిన చారిత్రక యోగ్యతా పత్రం. ప్రముఖ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావుగారు కూడా మండలి కృష్ణారావుగారి కృషిని ఎలాంటి శషభిషలు లేకుండా గుర్తించి, సంపాదకీయాలు రాశారు.

vii. భాష–సంస్కృతులపై ఆయనకు మక్కువ ఎక్కువ. ఆయన పూనుకొని నాయకత్వం వహించి, నాటి ప్రభుత్వ సహకారంతో నిర్వహించిన మొట్టమొదటి ప్రపంచ తెలుగు మహాసభలు ఆయన సాంస్కృతిక జీవితానికి కలికితురాయి. నేటి వరకు కూడా ఆయన సృష్టించిన వారసత్వం కొనసాగుతోంది. ప్రపంచవ్యాప్తంగా తెలుగు మూలాల ప్రజలను ఆయన కదిలించారు. ఈ సభల నిర్వహణతో ఆయన దక్షత వివిధ మూలల్లోని తెలుగు వారందరికీ తెలిసింది.

మండలి కృష్ణారావుగారి నిర్మాణాత్మక కార్యక్రమాలు, మార్పుకోసం తపన తదితర విషయాలు చివరిదైన మూడవ దశలో, అంటే పరివ్యాపిత దశలో (1977–1997) స్థానిక, జాతీయ సరిహద్దులు దాటి విఖ్యాతమైనాయి. 1977వ సంవత్సరంలో దివిసీమలో ఉప్పెన సంభవించింది. ప్రాణ నష్టం, ఆస్తి నష్టం ఊహకందని స్థాయిలో జరిగాయి. ఉప్పెన అనంతరం చేపట్టిన పునరావాస కార్యక్రమాలు ఆయన పేరును విశ్వవ్యాపితం చేశాయి. ఉప్పెన వచ్చిన తరువాత తక్షణం చేపట్టిన కార్యక్రమాలు, తదనంతరం చేపట్టిన పునరావాస (నిర్మాణ) కార్యక్రమాలు ఆయనలోని గాంధేయ స్ఫూర్తికి నిలువెత్తు నిదర్శనాలు. వీటిలో కూడా ఆయన తన బృందంతో కలిసి (ఉదాహరణకు ప్రభాకర్‌జీ, లవణం, హేమలతా లవణం, ప్రభుత్వాధికారులు, ఇతర స్వచ్ఛంద సంస్థలు మొ॥ నవి) చేపట్టిన పనులు చాలా విలక్షణం. ఈ మొత్తం వ్యవహారంలో మూడు విషయాలు గమనార్హం.

i. ఉప్పెన అనంతరం గుట్టలు, గుట్టలుగా పేరుకు పోయిన మృత కళేబరాలు కార్యకర్తలకు పెద్ద సమస్యను తెచ్చాయి. ఒకవైపు వేలల్లో శవాలు. మరోవైపు పొంచివున్న వ్యాధులు. ఈ సమస్యను అధిగమించుటకు ఆయన తన మిత్ర బృందంతో కలిసి 'శవసేవ'ను ఏర్పాటు చేశారు. దీనిలోని సభ్యుల పని శవాలను, కళేబరాలను అత్యంత త్వరితంగా ప్రక్షాళన చేయడమే! దీనితో సమస్యను కొద్దిరోజుల్లోనే అధిగమించారు.

ii. ఉప్పెన బాధితులకు సహాయం, విరాళాలు వెల్లువలా వచ్చాయి. ఈ సహాయాన్ని కులమతాలకతీతంగా అందించేందుకు ఆయన అహర్నిశలు శ్రమించారు. వచ్చిన సహాయం ఏ సంస్థ నుండి వచ్చినా (మత సంస్థ, కుల సంస్థ తదితరాలు) దానిని అందరికీ సమానంగా, సమదృష్టితో పంచడానికి ఏర్పాట్లు చేశారు. ఈ విషయంలో ఎవరు పరిమితులు విధించినా అంగీకరించలేదు. ఉప్పెన అనుభవాలు ఆనాటికి అందరికీ కొత్తే! కావున, సహాయక, పునరావాస చర్యలన్నీ కూడా ఒక విధంగా ప్రయోగాలే! వీటి నుంచి అనేకులు అనేక అంశాలను నేర్చుకున్నారు.

iii. పునరావాస చర్యల్లో భాగంగా ప్రజలకు ప్రత్యామ్నాయ ఆదాయ మార్గాలను కల్పించాలి. దివిసీమ వంటి గ్రామీణ ప్రాంతంలో ప్రభుత్వం కాని, ఇతర ప్రైవేటు సంస్థలు కాని ప్రత్యామ్నాయ ఆదాయ మార్గాలు చూపాలంటే సమయంతో, ఖర్చుతో కూడుకొన్న పని. ఈ సమయంలోనే మండలి కృష్ణారావుగారు జీవితాంతం నమ్మి,

ఆచరించిన గాంధీజీ సిద్ధాంతాలు, నిర్మాణాత్మక కార్యక్రమాలు ఈ సమస్యకు సమాధానం చూపాయి. దీనిలో భాగంగా గ్రామీణ సమాజంలోని వివిధ వృత్తుల వారికి వారి వృత్తుల్లో ఉపయోగపడే పనిముట్లను పంపిణీ చేశారు. ఆనాటికి ఇదొక కొత్త ప్రయోగం. దీనిని విజయవంతంగా నిర్వహించారు. ఈ కార్యక్రమ సాఫల్యతను అనేకమంది వ్యక్తులు, దాతృత్వ సంస్థలు గుర్తించాయి. దివిసీమ ఉప్పెన సహాయక, పునరావాస చర్యలతో మండలి కృష్ణారావుగారి కృషి పరివ్యాపితమై, ప్రపంచమంతా తెలిసింది. ముఖ్యంగా, అభివృద్ధి కార్యక్రమాలపై దృష్టి సారించిన వారందరికీ దీని ప్రాధాన్యత తెలిసింది.

మండలి కృష్ణారావుగారు అవనిగడ్డలో తాను స్థాపించిన గాంధిక్షేత్రాన్ని ఒక గొప్ప శిక్షణా కేంద్రంగా మలచారు. గ్రామీణ నిర్మాణ కృషిలో భాగమైన కార్యకర్తలందరికీ శిక్షణ నిచ్చే సంస్థగా రూపొందించారు. ఇలాంటి పనిని సాధారణంగా స్వచ్ఛంద సంస్థలో, వ్యక్తులో, దాతృత్వ సంస్థలో చేస్తాయి. ఒక రాజకీయ నేత దానిని చేపట్టడం ఇచట ప్రధానం. ఆయన తరం వరకు గాంధీజీ నిర్మాణ కార్యక్రమాల స్ఫూర్తి కొనసాగింది. దానికి మరికొంత సంస్కరణాభిలాషను రంగరించి ఒక ఉద్యమంలా కొనసాగించిన వ్యక్తి మండలి కృష్ణారావుగారు. ఆయనలోని సంఘశీలత, సంస్కరణాభిలాషలు అందరికీ తెలియవలసిన చారిత్రక అవసరం నేడు వున్నది. ఒక దార్శనికునిగా ఆయన వెలిబుచ్చిన అభిప్రాయం మనం ఇచట గమనించాలి.

మనదేశం గొడ్డుపోలేదు. ఎందరో మహానుభావులు పుట్టారు. పుడతారు కూడాను. న్యాయం కోసం, ధర్మం కోసం ప్రాణాలను త్యాగం చేసినవారూ వున్నారు. వెలుగులోకి రానివారెందరో వున్నారు. వీరందరినీ వెతికి బయటకు తీసుకురావడం మనవంతు. ఇది జరిగిన రోజున మనం కొనసాగిస్తున్న సాంఘిక విప్లవంలో మరొకమెట్టు ఎక్కినట్లే భావించవచ్చు.

మండలి కృష్ణారావుగారు వ్యక్తీకరించిన పై భావం సామాన్య నాయకులకు, కార్యకర్తలకు అందే విషయం కాదు. దానికి సంఘశీలత ఉండాలి. సంస్కరణపై అవగాహన ఉండాలి. మార్పుపై మక్కువ వుండాలి. ఇవన్నీ మండలి కృష్ణారావుగారిలో పుష్కలం. రాజకీయ వ్యక్తిత్వాన్ని మించిన ఆయన సాంఘిక వ్యక్తిత్వం, సంస్కరణ ప్రియత్వం భావితరాలకు తప్పక తెలియాలి. అప్పుడే సాంఘిక మార్పు, అభివృద్ధి ప్రాముఖ్యతను భావితరాలు సరియైన రీతిలో విశ్లేషించుకోగలరు.

**సమాచార వనరులు**


- Ramakrishna Reddy, V.(Ed) (2016) Contemporary History of Andhra Pradesh and Telengana, AD 1956-1990s. Hyderabad.
- Sachs, Wolfgang. (Ed.) (1997). The Development Dictionary: A Guide to Knowledge as Power. New Delhi.

- Sundar, H.S.S. Kompalli. (2105). In Pursuit of Self Respect: Colonial India During 19th century - Dynamics of Social and Political Life in Andhra and Rayalaseema. New Delhi: Manak Publications.
- మండలి వెంకట కృష్ణారావు. (2013). వ్యాసాలు–ఉపన్యాసాలు. హైదరాబాద్: ఎమెస్కో బుక్స్
- లవణం (2016). నా స్మృతి పథంలో విజయవాడ: ప్రజాశక్తి బుక్‌హౌస్
- హేమలతా లవణం (2016). ఇది నా జీవితం – మృత్యోర్మా అమృతంగమయ. విజయవాడ: ప్రజాశక్తి బుక్‌హౌస్
- మండలి వెంకట కృష్ణారావు 50వ జన్మదిన అభినందన సంచిక (1975), హైదరాబాదు.
- The Atheist, July - August 1975
- ఆంధ్రభూమి (దినపత్రిక), 25.9.1972, 26.9.1972.


★ ★ ★

# ప్రజల మనిషి

**– డా॥ వేటూరి ఆనందమూర్తి**

1974కి పూర్వం ఒకసారి మిత్రులు కృష్ణమరాజుగారు నన్ను మంత్రివర్యులు మండలి కృష్ణారావుగారి యింటికి తోడుకొని వెళ్లారు. ప్రథమ పరిచయంలోనే వారి మంచితనం, నిరాడంబరత నన్ను ఆకర్షించింది. కుశల ప్రశ్నాదికమయ్యాక వారితోపాటే మేమూ అల్పాహారం సేవించి సెలవు తీసుకున్నాము.

ఆ సంవత్సరమే మే నెల 14 వ తేదీ తాళ్లపాకలో నా థీసీస్ ప్రథమభాగం ఆవిష్కరింపబడింది. మండలి కృష్ణారావుగారే సభాధ్యక్షులు. తిరుమల తిరుపతి దేవస్థానముల కమిషనరు అన్నారావుగారు మున్నగువారి సమక్షంలో దేవదాయ మంత్రివర్యులు సాగి సూర్యనారాయణ రాజుగారు నా గ్రంథాన్ని ఆవిష్కరించారు. అప్పుడొక అద్భుతం జరిగి ప్రసారమాధ్యమంలో విస్తృతంగా వెల్లడైనది. మేమెవరమూ పెట్టని ఐదురూపాయల కొత్త నోటు ఒకటి ఆవిష్కరించిన పుస్తకంలో కానరాగా, దానిని వారు వేలానికి పెట్టడం, స్థానిక %ఖఉజు% ప్రభావతమ్మగారు దాన్ని 500/- రూపాయలకు కొనడం జరిగింది. వారిని నేనింకో సభలో కలుసుకున్నపుడు, ఆ నోటును భద్రంగా తమ పూజామందిరంలో దాచుకున్నా మని నాతో అన్నారు!

తాళ్లపాకలో, దేవుని సన్నిధిలో, అలా ప్రారంభమైన మండలివారి తోడి మా తొలి పరిచయం, వేటూరివారి జన్మస్థలమైన దివితాలుకా పెదకళ్లేపల్లి అనుబంధంతో మరింత పటిష్టమైంది.

ఒకరోజున కృష్ణారావుగారు మేమున్న విజయనగర్ కాలోనిలోని తమ మిత్రులు చక్రపాణిగారితో కలిసి దగ్గరలోనే ఉన్న మా యింటికి దయచేశారు. సంభాషణలో మా కుటుంబసభ్యులను పెదకళ్ళేపల్లికి పిల్చి సత్కరించాలనీ, నాయన(వేటూరి)గారి విగ్రహం అక్కడ ప్రతిష్టాపించాలనీ తమ అభిప్రాయాన్ని వెల్లడించారు. "మా సత్కారాల మాటకేమిగానీ, నాయనగారి విగ్రహం పెదకళ్లేపల్లిలోనూ, విజయవాడలోనూ రెండుచోట్లా తప్పక ప్రతిష్ఠాపించవలసిందే!" అని అప్పుడన్నాను. నాటి పెద్దల సంకల్పం అనంతర కాలంలో సద్గురువుల అనుగ్రహంతో, తిరుమల తిరుపతి దేవస్థానములవారి సహకారంతోనూ, యల్.వి.యస్, మండలి బుద్ధ ప్రసాద్‌గార్ల పూనికతో ఫలించింది. విగ్రహ స్థాపనతోపాటు తిరుపతి, మద్రాసు, మైసూరు, హైదరాబాదు, న్యూఢిల్లీ వంటి మహానగరాల్లోనూ తరువాత మహాసభలు వైభవంగా జరిగినవి.

ఉస్మానియా యూనివర్సిటీలో మేము కొందరము నారాయణరెడ్డిగారి అధ్యక్ష్యతలో, తెలుగు భాషా బోధనవిషయమై కరికులంలో తేవాలనుకొన్న మార్పులను గూర్చి చెప్పినపుడు విద్యామంత్రి మండలివారు చూపిన చొరవ, ఇచ్చిన ప్రోత్సాహమూ మరువలేనిది. కొద్దిగా విస్తరిస్తాను. మనం వేరే దేశానికి చదువుకొరకో, ఉద్యోగానికో వెళ్ళినపుడు వారి భాషను తప్పనిసరిగా నేర్చుకోవలసిన అవసరం కలుగుతుంది. కానీ! మనదేశంలోనో? దానికి విరుద్ధంగా ఏ ఇరాన్ నుంచో, నైజిరియా నుంచో విద్యార్థులు మన రాష్ట్రానికి వచ్చి రెండు మూడేళ్లుండీ కూడా తెనుగు ఒక్క అక్షరం నేర్చుకోకుండానే చదువు ముగించుకొని వెళ్లిపోతున్నారు. ఈ పరిస్థితిని చక్కదిద్దాలి! ఇందుకు నేను, మా లింగ్విస్టిక్స్ ప్రొఫెసరు జె.వి. శాస్త్రి గారూ కలిసి కూచుని ఒక బృహత్ప్రణాళికను తయారు చేశాము. అందుకు కరికులంలోనూ, సిలబస్‌లోనూ అవసరమైన మార్పుల్ని చేర్పుల్ని సూచించాము. కావలసిన అన్ని హంగుల్ని కల్పిస్తూ, ఒక బేసిక్ కోర్సునీ, బ్రిడ్జి కోర్సునీ, బూస్టర్ కోర్సునీ రూపొందించాము. వీటికన్నిటికీ అవసరమైన ఆర్థిక సహాయాన్ని మంత్రిగారు అందిస్తామన్నారు. కానీ చిక్కంతా మా ఆర్ట్స్ ఫేకల్టీతోనే వచ్చింది. మా యీ మూడు కోర్సులూ కాలేజీ పనివేళల్లోనే టైమ్ టేబుల్‌లో ఎవరికీ ఇబ్బందిలేని విధంగా చొప్పించాలనుకొన్నాము. అందుకు మాకు సుకరమైన మార్గం ఒక్కటే తోచింది. ఇంగ్లీషు బోధనకు వారానికి ఆరు పీరియడ్లు ఉండేవి. తక్కిన తెలుగు వగైరా రీజనల్ లాంగ్వేజస్‌కి నాలుగేసి పీరియడ్లు చొప్పున ఉండేవి. ఇంగ్లీష్‌కి ఒక పీరియడు తగ్గించి ఆర్.ఎల్. (రీజనల్ లాంగ్వేజస్)కి ఒకటి పెంచితే సరిపోతుందని సూచించాము. ఇంగ్లీషు డిపార్టుమెంటువారు అందుకు ఒప్పుకోలేదు. దాంతో మా ప్రణాళికలన్నీ నిర్వీర్యము లైపోయినాయి.

ఆ పైన నేనూ డెప్యుటేషన్ మీద మారిషస్ వెళ్ళవలసివచ్చినది. అంతటితో ఆ పని ఆగిపోయింది. ఇప్పటికీ ఆ పరిస్థితులు అలాగే ఉన్నవి. ఎప్పటికైనా భాషాబోధన సత్ఫలితాలివ్వాలంటే అలాంటి ప్రణాళికలు మన రాష్ట్రాల్లోనూ అమలు కావలసిందే అని నమ్ముతున్నాను. ఫైలు డిపార్టుమెంటులోనే ఉందనుకుంటాను.

1976లోనే, మారిషస్‌కి వెళ్లబోయే ముందేనేమో కూడా తాళ్ళపాక వారి మీది నా థీసిస్ రెండో సంపుటం తిరుపతిలో విడుదలైంది. ఆవిష్కర్త గౌ. మండలి కృష్ణారావుగారే! తిరుపతిలో నాటి సభను ఏర్పాటు చేసినవారు నాయనగారి శిష్యులు, యోగమిత్రులు శ్రీ సింగరాజు సచ్చిదానందంగారు! ప్రథమ ప్రతిని అందుకొన్నవారు పండితులు, తాళ్లపాక కృతుల పరిష్కర్తలు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు. సభలో ఉపవిష్టులైనవారు నాటి తిరుపతి సమాజంలో ప్రముఖులైన యెందరో మహానుభావులు! వారందరికీ వందనాలర్పిస్తున్నాను. అప్పుడు తీసిన ఫోటోలు కొన్ని ఇటీవల నా ముఖపుస్తకం పేజీలోనూ పెట్టాను.

1976లో రెండోసారి నేను భారత ప్రభుత్వ డెప్యూటేషన్ మీద మారిషస్ వెళ్ళడానికి, అంతకు పూర్వం 1966-70లలో నేనక్కడ కల్పించిన పూర్వరంగం కొంత కారణం కావచ్చు. అప్పటికి ఆ దేశం ఇంకా స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకోలేదు. ఫార్మటివ్ దశలో ఉండినది.

1976 నాటికి ఆ దేశం పరిస్థితులు మారి రెండవ ప్రపంచ హిందీ మహాసభల్ని హోస్టు చేసే ఉన్నత స్థితికి వచ్చింది.

ఒక రోజు నేను నిజామ్ కాలేజీ క్లాసులో ఉండగా, ప్రిన్సిపాల్‌గారి నుండి కబురు వచ్చింది. ఎడ్యుకేషన్ మినిస్టరుగారు కారు పంపిస్తున్నట్టూ, నన్ను అర్జెంటుగా వారి ఛాంబరులో కలుసుకోవాలనీ! వెళ్ళాను. స్పెషల్ కామన్వెల్త్ ఆఫ్రికన్ అసిస్టెన్స్ ప్లాన్ (SCAAP) క్రింద నా మారిషస్ ప్రయాణం అంతకుముందే నిశ్చయమయినా, మా అఫీషియల్ పాస్‌పోర్ట్ వగైరాలు ఇంకా నా చేతి కందలేదు. మినిస్టరుగారు హిందీ కాన్ఫరెన్సుకి వెళ్లే తేదీ నిశ్చయమై, ఆ మర్నాడే ఆఫీసు పనిమీద వారు ఢిల్లీ వెళుతున్నారు. నన్నడిగి వివరాలన్నీ తెలుసుకొని, మారిషస్‌కి కలిసి వెళదామని చెప్పి, ప్రయాణానికి నన్నూ సిద్ధంగా ఉండమని అన్నారు. మధ్యలో శని, ఆదివారాలూ, పండుగ సెలవులూ వచ్చి నాలుగైదు రోజుల వ్యవధే ఉండింది. అప్పుడు నా థీసిస్ రెండో సంపుటం ముద్రణం ముగిసి, విడుదలైనా ప్రెస్సునుండి కాపీలన్నీ బైండై యింటికి చేరలేదు. వాటిని రిసీవ్ చేసుకునే బాధ్యతను మా తోడల్లుడు రామశేషుగారిమీద వదిలి, నేను సకుటుంబంగా మారిషస్ ప్రయాణానికి సిద్ధపడ్డాను. ఆశ్చర్యంగా ఐదోరోజు ప్రొద్దున లేచి వార్తాపత్రిక చూద్దును గదా బాక్సు కట్టిన తాజా PTI వార్త ఫ్రంట్ పేజీలో కనపడింది. అన్ని పత్రికల్లోనూ వార్త వచ్చేసింది, నేను డెప్యుటేషన్ మీద సకుటుంబంగా మారిషస్ వెళుతున్నట్టు! ఢిల్లీనుండి మినిస్టరుగారు హైదరాబాదుకి తిరిగి వచ్చేలోగానే ఆ వార్త నాకు చేరింది! అభినందన సందేశాలూ, టెలిగ్రాములూ వెల్లువెత్తాయి. మా పాస్‌పోర్టు, ఫారిన్ ఎక్స్ఛేంజి వగైరాలన్నీ, MEA వారి శుభాకాంక్షలతో సహా మండలివారే నాకు అందించారు. "రాజు తలచుకొంటే?" అన్న సామెత నాకు గుర్తుకు వచ్చి, పదవిలోని ప్రాభవమేమిటో అప్పుడు నాకు తెలియవచ్చింది!

అనుకొన్న ప్రకారం అందరం ముంబాయి చేరుకున్నాం. మంత్రిగారితోపాటు నాకూ అక్కడి తెలుగువారి రిసెప్షన్లు! మర్నాడు బయలుదేరాము. ఆదే ఫ్లైట్‌లో మారిషస్ ప్రధానమంత్రి సర్ శివూసాగర్ రాంగులామ్ గారూ ఉన్నారని తెలిసింది. మండలి వెంకట కృష్ణారావుగారు, ఎగ్జిక్యూటివ్ క్లాస్‌లో కూచున్న రాంగులామ్ గారిని మర్యాద చొప్పున కలుసుకోబోతూ నన్నూ రమ్మన్నారు. మంత్రిగారు నన్ను పరిచయం చేయబోతుండగా "I know him. We were expecting him" అంటూ ఉభయులకూ వారు వెల్‌కమ్ చెప్పారు. మారిషస్ చేరాము. మినిస్టర్ గారికి పరిచితులైన ఏరోడ్రోమ్ ఆఫీసరు, ఇండియన్ ఎక్స్‌పర్ట్ శ్రీ ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కూడా డ్యూటీలో ఉండి మా కక్కడ తారసపడ్డారు. అయన మంచి స్నేహశీలి!

ప్రోటోకోల్ ప్రకారం మంత్రిగారికీ, మాకూ VIP లాంజ్‌లో ఎదుర్కోలు పలకడానికి ప్రభుత్వ సిబ్బంది, హిందీ కాన్ఫరెన్స్ ప్రముఖులూ చాలామంది విచ్చేశారు. స్కాప్ ఎక్స్‌పర్ట్ గా నన్నూ, నా కుటుంబాన్నీ రిసీవ్ చేసుకోడానికి ఆంధ్రమహాసభ ప్రతినిధులూ, మరికొందరు తెలుగువారూ, ఎడ్యుకేషన్ మినిస్ట్రీవారూ, హై కమిషన్ సిబ్బంది అందరూ కలిసి వచ్చారు. మంత్రిగారికి తగిన వసతి గల సీసైడ్ కాప్మాలో బస యేర్పాటు

జరిగింది. నన్నూ, నా కుటుంబ సభ్యులను, నచ్చిన వసతిగల ఇల్లు దొరికే వరకూ క్యూర్‌పిప్ లోని పెద్ద హోటల్‌లోనే ఉండవచ్చు నన్నారు. గమ్మత్తు ఏమిటంటే అన్ని వసతులూ ఉన్న ఒంటరి కాప్మావాసం కన్నా కృష్ణారావుగారికి జనావాసాల మధ్య క్యూర్పిప్ నగరంలోనే ఉంటానని చెప్పి తమ బసను మార్చేసుకున్నారు. అయన ప్రజలమనిషి కదా!

మర్నాడు లాంఛనం ప్రకారం అఫీషియల్‌గా కలియవలసిన వారిని అందరినీ కలుసుకున్నాము. నా కార్యక్షేత్రమైన MGI పరిసరాల్లోనే రెండో ప్రపంచ హిందీ మహాసభలు కనులపండువుగా ఏర్పాటైనవి. ఆ వారం పొడుగూనా దేశమంతా కోలాహలమే! నా డ్యూటీ చూసుకుంటూ వీలైనప్పుడల్లా కాన్ఫరెన్సుకి వెళ్లి వచ్చేవాణ్ణి. ప్రపంచ హిందీ సభలకు ముఖ్యాతిథిగా భారత ప్రతినిధి ఆనరబుల్ శ్రీ కరణ్ సింగ్‌గారిని, దక్షిణ దేశంనుండి వచ్చిన ఇతర హిందీ విద్వాంసులందరినీ నేనూ కలిశాను. కాన్ఫరెన్స్ ముగిసిన తర్వాత అక్కడి ఆంధ్ర మహాసభ ప్రతినిధులతో కలిసి మంత్రిగారూ, మేమందరమూ గౌ? కరణ్ సింగ్‌గారికి ఏర్ పోర్టులో వీడ్కోలు పలికి ఫోటోలు దిగాము కూడా.

మండలి కృష్ణారావుగారు అక్కడున్న వారం పదిరోజుల్లోనూ అనేక ముఖ్య సమావేశాలు జరిగినవి. ఆ వివరాలన్నీ మిత్రులు వేమూరి రాధాకృష్ణమూర్తిగారు మంత్రిగారి డైరీ మెయిన్‌టైన్ చేసి, తమ మారిషస్ యాత్రా గ్రంథంలో ఫోటోలతోసహా ప్రకటించారు. మరి కొన్నిటిని నేనిక్కడ గుర్తుచేసుకొంటాను!

ఈ మారు, మాటలు తగ్గించి, అందుబాటులో నున్న ఫోటోలు మాత్రమే మరికొన్ని పెట్టగలను. ఎందుకంటే అవే మాటలకన్నా ఎక్కువ అనుభూతిని కలిగిస్తాయి!

ప్రోటోకోల్ ప్రకారము ఆ దేశ ప్రధానమంత్రినీ, ఇతర మంత్రులనూ, ఆంధ్ర మహాసభ ముఖ్యులనూ మండలివారు కలిసి స్నేహసూచకంగా కొన్ని పెయింటింగులూ, బహూకృతులు అవీ అందించారు. కొన్ని సందర్భాలలో నేనూ ప్రతినిధివర్గం వెంట ఉన్నాను. మారిషస్ ఆంధ్ర మహాసభనూ, అక్కడి ప్రతినిధులనూ కలిసి పరస్పర ప్రయోజనకరములైన చర్చలు జరిపారు. నాతోనూ సంప్రదించి అక్కడి విద్యా బోధనకూ, తెలుగుభాషా వ్యాప్తికీ ప్రణాళికాబద్ధములైన శీఘ్రకాలిక, దీర్ఘకాలిక చర్యల్ని ప్రోత్సహించారు. టీచర్ల నడిగి స్థానిక అవసరాలకు తగిన క్రొత్తవాచకాల తయారీకి మద్దతు పలికారు. బడులనూ, తెలుగు తరగతులనూ, బోధనా విధివిధానాలనూ పరిశీలించి విద్యార్థులనూ, టీచర్లనూ ఉత్తేజపరిచారు.

ఆ సమయంలోనే భారత ప్రభుత్వ ఫిలిమ్స్ డివిజన్ వారూ వచ్చి మారిషస్‌లో భారతీయ భాషల బోధనపై చక్కని డాక్యుమెంటరీని తీశారు. ఆ సన్నివేశంలో మండలి కృష్ణారావుగారు తెలుగు తరగతులను పరిశీలించడం కూడా ఉంది.

అచ్చమైన గాంధేయవాది కృష్ణారావుగారు ఎప్పుడు ఎక్కడికి వెళ్ళినా ముందే చెప్పినట్టుగా, ప్రజల మనిషిగానే పేరు తెచ్చుకున్నారు. సీదాసాదా ఖాదీ పంచెకట్టూ, బెల్టు షూలు, పదవిని, హోదాను అసలే పాటించని కలుపుగోరుతనం వారి వ్యక్తిత్వంలో



*గ్రంథావిష్కరణ చేస్తున్న శ్రీ మండలి, శ్రీ వేటూరి*

ప్రస్ఫుటంగా గోచరించేది. ఉన్నవారు లేనివారూ, పిన్నాపెద్దా తేడాలు లేకుండా అందరితోనూ ఇట్టే కలిసిపోయేవారు. ఈ లక్షణాలన్నీ మండలివారి కుటుంబ సభ్యులందరిలోనూ కనిపించడం సహజమే.

ఆ తర్వాత నేను మారిషస్‌లో ఉన్నప్పుడే 1977 నవంబర్ 19 దివిసీమలో అతి ఘోరమైన ఉప్పెన వచ్చి, 10 వేలకు పైగా జననష్టం, 4 లక్షలకు పైగా పశునష్టం జరిగింది. 72 గ్రామాలకు గ్రామాలే జలసమాధియై పోయినవని వార్త! అపారమైన ఆస్తినష్టమూ సంభవించింది. అట్టి విపత్తులో మండలి కృష్ణారావుగారు విలవిలలాడిపోయారని విన్నాను. వీడియోలలో చూశాను. అప్పటి విషాదఘటనలన్నీ ఇండియాకి తిరిగివచ్చిన తరువాత అవనిగడ్డ గాంధీక్షేత్రంలో జరిగిన ఒక సభలో మండలి బుద్ధప్రసాద్‌గారిని స్వయంగా అడిగి తెలుసుకొని చకితుడనైనాను. వారపుడు అవనిగడ్డలో ఏర్పాటు చేసిన చారిత్రక ప్రాధాన్యమున్న సభ అది. గాంధీక్షేత్రంలో జరిగిన ఆ సభలో చాలామంది పుణ్యాత్ముల్ని కలుసుకునే భాగ్యం కలిగింది నాకు.

ఈ సెప్టెంబరు 27 నుండి తెలుగునాట పెద్దయెత్తున జరుగబోయే మండలి కృష్ణారావుగారి సంస్మరణానికి జోహారులర్పిస్తున్నాను. ఇందుకు పూనుకొన్న మండలి బుద్ధప్రసాద్‌గారికి సప్రశ్రయంగా అభినందనలందిస్తున్నాను.

★ ★ ★



కేంద్ర మంత్రి శ్రీ కరణ్‌సింగ్‌తో శ్రీ మండలి, శ్రీ వేటూరి

# మండలి మానస పుత్రిక 'బాలల అకాడమి'

**- చొక్కాపు వెంకట రమణ,** *కేంద్ర సాహిత్య అకాడమి*
*బాల సాహిత్య పురస్కార గ్రహీత*

మండలి వేంకట కృష్ణారావు - ఆబాలగోపాలానికి ఎంతో ఇష్టమైన పేరు ఇది! వన్నె తెచ్చిన పేరు ఇది. మొట్టమొదట ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించటానికి నాంది పలికిన పేరు ఇది. విద్య, సాంస్కృతిక రంగాలలో పెను మార్పులు తీసుకురావడానికి ఎనలేని కృషి చేసిన పేరు ఇది. ప్రపంచంలో తెలుగు బాలలు ఎక్కడ ఉన్నా, వారిలో విజ్ఞాన, వినోద, వికాసాలను పెంపొందించేందుకు ఒక పటిష్టమైన వ్యవస్థ ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించి మేలు చేసి చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయిన పేరు ఇది.

ఆ పేరును తలుచుకుంటే ఒళ్ళు పులకరిస్తుంది. మనసు వికసిస్తుంది. విజ్ఞానం పరిమళిస్తుంది. అందుకే మండలి వేంకట కృష్ణారావు గారంటే నాకు ఎంతో ఇష్టం! గౌరవం! భక్తి! ఆరాధన!!

దేశంలో ఎక్కడా లేని బాలల అకాడమి మన రాష్ట్రంలోనే మొదటిసారిగా అవతరించింది. అలాంటి గర్వకారణమైన ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని పిల్లల కోసం స్థాపించిన మండలి వేంకట కృష్ణారావుగారిని తెలుగు బాలలలోకం ఎప్పటికీ మరిచిపోదు.

తెలుగు భాష, తెలుగు సంస్కృతి, తెలుగు బాలలు అంటే ఆయనకు ప్రాణం. అందుకోసం తన సర్వశక్తులను కేంద్రీకరించి ఎంతో సేవ చేశారు. అందరి మనసులలో నిలిచారు. అందుకే ఆయన చిరంజీవి! మండలి వారి ఆలోచనల నుండి పుట్టిన 'బ్రెయిన్ చైల్డ్' ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి పూర్వాపరాలు తెలుసుకుందాం!

బాలల్లో విద్య, సాంస్కృతిక, నైతిక ప్రమాణాలు పెంపొందించే ఒక వ్యవస్థ ఉండాలని మండలి వేంకట కృష్ణారావు అభిలషించారు. సంగీత, సాహిత్య, నాటక కళలకు అకాడమీలు ఉన్నట్లే బాలలకు కూడా ఒక అకాడమి ఉండాలనే ఆలోచన ఆయనకు కలిగింది. అంతే ఆయన దానిని కార్యరూపంలోకి తీసుకురావడానికి ప్రయత్నాలు మొదలెట్టారు. బాలసాహితీ, సాంస్కృతిక రంగాలలో నిష్ణాతులైన వారిని సంప్రదించారు. మండలి వారికి ఒక స్పష్టత ఏర్పడింది.

రాష్ట్ర విద్య, సాంస్కృతిక శాఖ మంత్రిగా ఉన్న మండలి వేంకట కృష్ణారావుగారి చొరవ, కృషి ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1974లో నిర్వహించిన అఖిల భారత బాలల మహోత్సవంలో ప్రత్యేక తీర్మానం చేసింది. రాష్ట్ర స్థాయి బాలల అకాడమి ఉండాలని జీ.వో. నెంబరు 241 పేరిట 1976 మార్చి నాలుగవ తేదీ ఉత్తర్వును జారీ చేసింది. అదే ఏడాది సెప్టెంబరు 14న అప్పటి భారత రాష్ట్రపతి ఫకృద్దీన్ అలీ అహ్మద్ చేతుల మీదుగా హైదరాబాదులోని జూబ్లీ హాలులో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమికి అంకురార్పణ జరిగింది. ఆనాడు మండలి వేంకట కృష్ణారావుగారి ఆనందానికి అవధులు లేవు.

బాలల సర్వతోముఖాభివృద్ధికి, వారిలో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించేందుకు బాలల అకాడమిని స్థాపించినందుకు ఆయన ఎంతో తృప్తి చెందారు. అంతేకాదు, బాలల రేడియో కార్యక్రమాల ద్వారా, 'బాల' పత్రిక నిర్వహణ ద్వారా అందరికీ సుపరిచితులైన ఆంధ్ర బాలల సంఘం వ్యవస్థాపకులు న్యాయపతి రాఘవరావును స్థాపక గౌరవ కార్యదర్శిగా నియమించారు. తెలుగు విజ్ఞాన సర్వస్వం నిర్మాణంలో విశేష కృషి చేసిన, విజ్ఞాన వాహిని, విజ్ఞాన ప్రగతి పత్రికల నిర్వహణలో అనుభవజ్ఞులైన బుడ్డిగ సుబ్బరాయన్‌ను కార్యనిర్వాహక కార్యదర్శిగా నియమించారు. బాల సాహిత్యంలో అనుభవంతో పాటు పత్రిక నిర్వహణలో అనుభవం గల చొక్కాపు వెంకట రమణను బాలల అకాడమి ప్రచురించే పిల్లల పుస్తకాల విభాగానికీ, 'బాలచంద్రిక' పిల్లల మాసపత్రికకు సంపాదకులుగా నియమించారు. విజయవాడ ఆకాశవాణిలో పిల్లల కార్యక్రమాల నిర్వహణలో అనుభవం ఉండి ఉద్యోగ విరమణ చేసిన ఏడిద కామేశ్వరరావుగారిని గౌరవ సంపాదకులుగా నియమించారు. బాలసాహితీ రంగంలో విశేష అనుభవంగల డా%॥% వెలగా వెంకటప్పయ్య, కవిరావు, డా%॥% బి.వి. నరసింహారావు, వేజెండ్ల సాంబశివరావు, మద్దిపట్ల వెంకటరావు వంటి వారితో ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేశారు. మండలి వేంకట కృష్ణారావుగారి ఆకాంక్షతో, ఆశీస్సులతో ఆయన కలలు గన్న బాలల అకాడమి ద్వారా నిర్మాణాత్మకమైన బాల సాహిత్య వికాస కార్యక్రమాలు ముమ్మరంగా జరిగాయి. మండలి వారు ఎప్పటి కప్పుడు ఆ వివరాలను తెలుసుకుంటూ తన వంతు సహకారాన్ని, సూచనలను అందిస్తూ వచ్చారు. తాను అనుకున్న కార్యక్రమాలు నిర్మాణాత్మకంగా అమలు జరిగేలా మరింత కృషి జోడించారు.

బాలల అకాడమి ఆధ్వర్యంలో అనేక సృజనాత్మక కార్యక్రమాలు జరిగాయి. 1976లో రాష్ట్ర స్థాయిలో "నేనెరిగిన ఆంధ్రప్రదేశ్" అనే అంశం మీద వ్యాస రచన పోటీ పెట్టారు. అందులో పాల్గొన్న బాలల్లోని ఉత్తమ తరగతి వ్యాసాలను రాసిన బాలలను ఎంపిక చేసి, వారందరినీ హైదరాబాదుకు రప్పించారు. వారిని రెండు బస్సులలో ఆంధ్రప్రదేశ్ అంతటా యాత్ర చేయించారు. చారిత్రకంగా, వైజ్ఞానికంగా ప్రసిద్ధి చెందిన స్థలాలను, ఆధునికమైన ప్రాజెక్టులను, ఫ్యాక్టరీలను పిల్లలకు చూపించారు. నెల రోజుల పాటు జరిపించిన ఆ విజ్ఞాన యాత్రను 'ఆంధ్రప్రదేశ్ దర్శిని' పేరుతో 90 నిమిషాల

నిడివి గల 35 ఎం.ఎం. రంగుల సినిమాగా రూపొందించారు.

ఇది ఎన్నో వ్యయప్రయాసలతో కూడుకున్న పని. మండలి వేంకట కృష్ణారావుగారు వివిధ జిల్లాలోని ప్రభుత్వ యంత్రాగాన్ని, స్వచ్ఛంద సంస్థలను సంప్రతించి, వారి సహకారాన్ని సమీకరించారు. పిల్లలకు ఎలాంటి ఇబ్బందులు కలగకుండా చూశారు. అన్ని ఏర్పాట్లు చేశారు. ఇవి మండలి వారి కార్యదీక్షకు, నిర్వహణ దక్షతకు, పిల్లల పట్ల గల ప్రేమకు నిదర్శనం. ఆయన కార్యక్రమ రచనా సామర్థ్యానికి ఒక మచ్చు తునక!

రాజకీయ రంగంలో వచ్చిన మార్పులను లెక్కచేయకుండా మండలి వేంకట కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. బాలల అకాడమి కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆయన ప్రత్యేక ఆసక్తి చూపడం వల్ల బాలల అకాడమి గణనీయమైన పనులు చేయగలిగింది.

1979లో బాలల అకాడమి తరపున నాగార్జునసాగర్‌లో రాష్ట్ర స్థాయిలో బాల సాహిత్య రచయితల శిక్షణా శిబిరం నిర్వహించి ఎందరికో పాఠాలు నేర్పించారు. బాల సాహితీ రంగానికి విశేష సేవలందించిన విశిష్ఠ వ్యక్తులను గుర్తించి 'బాలబంధు' అవార్డులతో సత్కరించి గౌరవించారు.

బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించటానికి బాలల అకాడమి రంగురంగుల బొమ్మల పుస్తకాలను ప్రచురించింది. ఎనిమిదేళ్ళ లోపు, 8 నుంచి 11 ఏళ్ల బాలలు, 12 ఏళ్ళు పైబడిన వారికి, వారి అవగాహన స్థాయికి తగిన వందకు పైగా పుస్తకాలను ప్రచురించింది. బాల సాహిత్యంలో మోడల్ పుస్తకాలుగా నిలిచిపోయేలా సరళమైన భాష, తేలిక పదాలు, ఆకర్షణీయమైన బొమ్మలతో ప్రచురించి అతి తక్కువ ధరలకు పిల్లలకు అందించింది బాలల అకాడమి.

అంతేకాదు, లబ్ధ ప్రతిష్ఠులైన బాల సాహితి రచయితల రచనల సంకలనాలను ప్రచురించి ముందు తరాలకు అందించే ప్రయత్నం చేసింది. అనుశ్రుతంగా వస్తున్న పిల్లల పాటలు, కథలు, ఆటపాటలు, లాలి జోలపాటలు – మొదలైన వాటిని ఆడియో కేసెట్లుగా 'చిలక పలుకులు' పేరుతో రూపొందించింది. వాటికి అనుబంధంగా పుస్తకాలు కూడా ముద్రించింది.

బాలల్లో పఠనాన్ని, సాహిత్యాభిలాషను పెంచడానికి ఆంధ్రప్రదేశ్ బాల అకాడమి అంతర్జాతీయ బాలల సంవత్సరం 1979లో 'బాలచంద్రిక' పిల్లల మాసపత్రికను ప్రారంభించింది. కార్యదర్శి బుడ్డిగ సుబ్బరాయన్ పర్యవేక్షణ, చొక్కాపు వెంకట రమణ సంపాదకత్వంలో బాలల మేధస్సును పెంచే అనేక విజ్ఞాన శీర్షికలు, కథలతో ఆకర్షణీయంగా రూపుదిద్దుకుంది బాలచంద్రిక. ప్రతి నెలా రాష్ట్రంలోని 40 వేల పాఠశాలలకు అందేది. ఐదువేల పాఠశాలల్లో 'బాలచంద్రిక తరగతి' అని ప్రత్యేకంగా ఏర్పాటు చేసి పిల్లలతో ఆ పత్రికను తరగతి గదిలో చదివించేవారు.

మండలి వేంకట కృష్ణారావుగారు ఎప్పటికప్పుడు బాలల అకాడమి కార్యక్రమాలను తెలుసుకుంటూ పిల్లల కోసం, వారి విజ్ఞానాభివృద్ధి కోసం తను కన్న కల సాకారం

అవుతున్నందుకు ఎంతో సంతోషపడేవారు. మండలి వారి కుమారుడు, యువకుడైన మండలి బుద్ధప్రసాద్ కూడా తరచు బాలల అకాడమికి విచ్చేసి, అ కార్యక్రమాలను పరీక్షిస్తూ, పర్యవేక్షిస్తూ, ఆ అభివృద్ధి పనులను తండ్రితో చర్చిస్తుండేవారు.

రాష్ట్రంలోని పాఠశాలల్లో చిట్టి గ్రంథాలయాలను ఏర్పాటు చేసుకునే నిమిత్తం బాలల అకాడమి ఒక పథకాన్ని రూపొందించింది. "ప్రతి బడికీ బాల సరస్వతీ పీఠం" పేరిట పిల్లల పుస్తకాలు, ఆడియో కేసెట్లను ఒక కిట్‌గా చేసి వేలాది పాఠశాలలకు పంపింది. పాఠశాలల్లో చిట్టి గ్రంథాలయాల ఏర్పాటుకు స్ఫూర్తినిచ్చింది. ఈ పథకమే ఆ తరువాత కేంద్ర ప్రభుత్వం 'ఆపరేషన్ బ్లాక్ బోర్డు పథకం' రూపకల్పనకు మార్గదర్శకంగా నిలిచింది.

దృశ్య శ్రవణ సాధనాలు బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను శక్తివంతంగా పెంపొందించగలవని గుర్తించిన బాలల అకాడమి అప్పట్లో దేశంలోనే తొలిసారిగా "ఇంద్రధనస్సు" పేరిట పిల్లల వీడియో పత్రికను రూపొందించి 12 సంచికలను విడుదల చేసింది.

బాలల్లోని సాంస్కృతిక ప్రతిభను ప్రోత్సహించేందుకు ప్రతి ఏడాది నవంబరు 14 నుంచి వారం రోజుల పాటు 'బాలల దినోత్సవ సప్తాహం' నిర్వహించింది బాలల అకాడమి. జంట నగరాల్లోని బాలానంద సంఘాలకు ఆర్థిక సహకారం అందించి వివిధ కార్యక్రమాల నిర్వహణకు తోడ్పడింది.

రాష్ట్రంలోని 23 జిల్లాలలోని విద్యాశాఖాధికారుల ద్వారా ఆయా జిల్లాలలోని పాఠశాల విద్యార్థుల సృజనాత్మకత కళలను వెలికి తీసి ప్రోత్సహించేందుకు వివిధ అంశాలలో పోటీ నిర్వహించింది. బహుమతులు, యోగ్యతా పత్రాలు అందించింది. జిల్లా స్థాయిలో ప్రథమ బహుమతి వచ్చిన బాలలతో రాష్ట్ర స్థాయి ప్రతిభా పాటవ పోటీలు నిర్వహించింది.

బాలల అకాడమి బాలల ఫిల్మోత్సవాలను నిర్వహించింది. 'చిట్టి బొమ్మలాట' పేరుతో పప్పెట్స్ తయారు చేయటం, ప్రదర్శించటం అనే అంశాలలో కార్యశాలలను నిర్వహించింది.

'తెలుగును కాపాడు కోవాలి. అన్ని స్థాయిలలో తెలుగును వాడాలి. తెలుగు పాట పాడాలి' అని అందరూ అనుకుంటున్న సమయంలో బాల స్థాయి నుంచే అలాంటి మార్పు రావాలని ఆశించి, కలలు కని, ఆ కలలను సాకారం చేసుకునేందుకు బాలల అకాడమి అనే వ్యవస్థను తెలుగు బాలలకు వరంగా అందించిన మండలి వేంకట కృష్ణారావుగారిని ఎవరు మరిచిపోగలరు. బాలల సర్వతోముఖాభివృద్ధికి దేశంలోనే మొదటిసారిగా రూపొందిన మండలి వేంకట కృష్ణారావుగారి మానస పుత్రిక – 'బ్రెయిన్ చైల్డ్' బాలల అకాడమి కొన్ని తరాల బాలల మీద ప్రభావం చూపింది. అందులో నేనూ భాగస్వామిని కావడం నా అదృష్టం !!

★ ★ ★

# నేనెరిగిన కీ.శే. మండలి వెంకట్రామయ్యగారు

**- చందన విష్ణువర్ధనరావు,** ఏలూరు

నాగాయలంక మండలం, భావదేవరపల్లి వాస్తవ్యులు కీ.శే. మండలి వెంకట్రామయ్యగారి గురించి నాకు తెలిసిన విషయాలు కొద్దిగా ముచ్చటిస్తున్నాను.

మండలి వెంకట్రామయ్యగారు గురించి నేను నాకు తెలిసిన విషయాలు వ్రాయడానికి కారణం నేను వారి అల్లుడిని కావడమే. వారి పెద్ద కుమార్తె రంగబంగారమ్మతో ఏప్రిల్ నేల 1959వ తేదీన మా వివాహము జరిగినది. విషయానికి వస్తే ఆయనను వారి స్వగ్రామంలో దివిసీమ గాంధీ అని పిలుచుకునేవారు. అందుకు కారణం వారి నడవడి, కొంతవరకు ఆకారము కూడా అలానే వుండేది. వారు వృత్తి రీత్యా ఎలిమెంటరీ స్కూలు టీచరుగా అనేక చోట్ల పనిచేసి చివరిగా భావదేవరపల్లి గ్రామ ఎలిమెంటరీ స్కూలు ప్రధానోపాధ్యాయునిగా పదవీవిరమణ చేశారు. కైకలూరు మండలం, ఆలపాడు, చల్లపల్లి దగ్గర నూకలవారి పాలెం మొదలైన ఇతర చోట్ల పనిచేసినారు. అందుచేత వారిని మాస్టారు అనే ఎక్కువగా సంభోదిస్తూండేవారు.

స్వతహాగా వారి స్వగ్రామం పులిగడ్డ అయినప్పటికీ బంధుజనం ఎక్కువగా భావదేవరపల్లిలో వుండుట చేత వారు అక్కడ స్థిర నివాసమేర్పరచుకున్నారు.

వారి మొదటి భార్య కాలము చేయుటచే, కైకలూరు తాలూకా పల్లెవాడ గ్రామ కాపురస్తులు దుట్టా రామయ్యగారి పెద్ద కుమార్తె మహంకాళమ్మగారితో రెండవ వివాహము జరిగినది. వీరికి సంతానము ముగ్గురు మగపిల్లలు, ఇద్దరు ఆడసంతానము. వారిలో పెద్దవారే మండలి వెంకట క్రిష్ణారావుగారు. నా స్వగ్రామము కూడా పల్లెవాడ కావడం యాదృశ్చికము.

మండలి వెంకట్రామయ్యగారి గురించి ముఖ్యముగా చెప్పుకోదగినవి వారి యొక్క నిజాయితీ, కార్యదీక్ష, తలపెట్టిన పని పూర్తయ్యే వరకు నిద్రపోని తత్వము. ఈ కారణము చేత కుటుంబ మంచి చెడ్డలు పెద్దగా పట్టించుకునే వారు కాదు. ఆ బాధ్యతలన్నీ మా అత్తగారైన మహంకాళమ్మగారు, పెద్దకుమారుడు మండలి వెంకట క్రిష్ణారావుగారే చూసుకునేవారు.

మండలి వెంకట్రామయ్యగారి నిజాయితీ, కార్యదీక్ష కారణమున గ్రామ సర్పంచ్ గా

ఏకధాటిగా ఏకగ్రీవముగా 25 సంవత్సరములు చేసినారు. ఈ సమయములోనే గ్రామానికో పెద్ద సమస్య వచ్చినది. అదే బంజరు భూముల సమస్య.

ఆ భూములను గ్రామస్తులకు కాకుండా మిలిటరీ వారికి గవర్నమెంటు ఇవ్వజూపటం, ఆ విషయములో తండ్రి కొడుకులు అవిశ్రాంత పోరాటము చేసి చివరకు గ్రామ ప్రజలకు ఒక్క విధముగా కోర్టు ఆర్డర్ తెచ్చినారు. ఈ విషయములో తండ్రీ కొడుకులను చంపే ప్లాన్ వేసి కొంతకాలము అజ్ఞాతవాసము కూడా గడిపినారని తెలిసినది.

భావదేవరపల్లి గ్రామమధ్యలో భావనారాయణ స్వామి వారి ఆలయం యున్నది. ఆలయమునకు ధర్మకర్తగా దగ్గర బంధువులైన భోగాది అప్పారావు గారు వుండేవారు. అప్పట్లో గ్రామ కట్టుబాట్లు ఎలా వుండేవంటే గ్రామములో ఏ సమస్య వచ్చినా గ్రామపెద్దల తీర్పు శిరోధార్యం. పెద్దల కమిటీనే గ్రామ న్యాయస్థానం. అందులో ముఖ్యులు మండలి వెంకట్రామయ్యగారు, ధర్మకర్తగారు. వీరి ఇంటి ముందు భాగములో కచేరి చావడి వుండేది. ఏ సమస్య వచ్చినా ఆ కచేరి చావడే న్యాయస్థానం. అక్కడే నిస్పక్షపాతముగా తీర్పులు వెలువరించేవారు. వీటితో పాటు గ్రామ అభివృద్ధి విషయంలో ఎంతో శ్రద్ధ వహించేవారు. ఇంటి పనులు ఏమి పట్టించుకోకుండా ఎప్పుడు గ్రామ వ్యవహారములలోనే మునిగి తేలుతుండేవారు. తీర్పు అమలు జరిపే సమయంలో పంచాయితీ సొమ్ము తగినంత లేని సమయంలో సొంత డబ్బు వెచ్చించి ఇబ్బందులలో పడేవారు. ఈ విధముగా గ్రామము, చుట్టుప్రక్క గ్రామములలో మంచి పేరు సంపాదించి చివరిగా 1969 మే నెలలో స్వర్గస్తులైనారు.

## కీ.శే. మండలి వెంకట కృష్ణారావుగారితో నా అనుభవాలు

మండలి వెంకట కృష్ణారావుగారి గురించి నేను ఏదైనా వ్రాయాలంబే నాకున్న కాద్దిపాటి అరత ఏదైనా వుందంటే నేను వారి సొంత చెల్లి భర్తగా మాత్రమే వారి గురించి తెలిసిన విషయాలు కొద్దిగా ముచ్చటిస్తాను.

మండలి వెంకట కృష్ణారావుగారు మచిలీపట్నం కాలేజిలో చదువుతున్నప్పుడు కాలేజిలో విద్యార్థి నాయకుడిగా, తరువాత కాంగ్రెసు పార్టీ యూత్ లీడర్‌గా వారు పనిచేయడం, 1957లో వారు పార్లమెంటు మెంబరుగా అతి చిన్న వయస్సులో ఎన్నిక కావడం మనందరికీ గర్వకారణం.

1959 ఏప్రియల్ నెలలో వారి పెద్ద చెల్లియైన రంగ బంగారమ్మతో నాకు వివాహము జరిగినది. వివాహ కార్యక్రమంతా వారే జరిపించినారు.

విషయానికొస్తే వారు ఆ సమయంలో క్రిష్ణా జిల్లా రాజకీయాలలో ప్రముఖ వ్యక్తిగా వుండేవారు. దానికి కారణం, ఆనాటి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారికి జిల్లాలో కుడి భుజంగా వుండేవారు. ఆ విధముగా 30-35 సంవత్సరముల వయసులోనే

రాజకీయంగా ఎంతో ఎత్తుకు ఎదిగినారు. కాంగ్రెసు పార్టీలో సీనియర్ అయిన గొట్టిగాటి బ్రహ్మయ్యగారితో వీరికి ఆత్మీయ సంబంధం. నేను ఒకరోజు మండలి వెంకట కృష్ణారావుగారితో కలసి మచిలీపట్నం కాంగ్రెస్ ఆఫీసుకు వెళ్ళడం తటస్థించినది. అక్కడ బ్రహ్మయ్యగారు కూడా వున్నారు. అప్పుడు బ్రహ్మయ్య బ్రహ్మయ్యగారి వయస్సు 60 సం.లు పై మాటే. ఆ వయసులో అందరి ఎదురుగా ఆయన దువ్వెనతో తల దువ్వుతున్నారు. అది చూసి యీ కుర్రకారు నాయకులందరూ ఆట పట్టించి ఏమిటీ నీకు యీ వయసులో కూడా తల దువ్వాలా అంటే, ఆయన వెంటనే మీరంతా కుర్రావాళ్ళు, సహజంగానే మీరు అందంగా వుంటారు. నాలాంటి వారు దువ్వుకుంటే గాని అందంగా కనబడం అంటే అందరు ఒకటే నవ్వు.

మండలి వెంకట కృష్ణారావుగారితో నేను ముఖ్యంగా గమనించినదేమిటంటే లేనివారంటే వారికి అమితమైన ప్రేమ. వారెప్పుడూ వారి బాగోగులు గురించే ఆలోచించేవారు. దానికి కొంత కారణం వారు చిన్నప్పుడు చదువుకొనుటకు పడిన ఇబ్బందులయి వుండవచ్చు.

రెండవది కార్యదీక్ష. నాకు తెలిసి దివిసీమ చాలా వెనుకబడిన ప్రాంతం. అందుచేత వారి మనసెప్పుడూ దివిసీమ అభివృద్ధి  మీదే లగ్నమయివుండేది. ఆవిధముగావారి జీవితాన్ని దివిసీమ అభివృద్ధికి ధారపోసినారు. ముఖ్యముగా సముద్రపు కరకట్టలు, పులిగడ్డ ఆక్విడెక్ట్ పెంపుదల, రోడ్లు మొదలైన వాటిని ఏర్పర్చి దివిసీమను దివ్యసీమగా మార్చిన ఘనత వారిది.

ఇక మా విషయాని కొస్తే ఉద్యోగరీత్యా రాష్ట్రములో నేను అనేక ప్రాంతములలో పనిచేయడం జరిగింది. వారికి సమయం దొరికినప్పుడల్లా మేమున్న చోటికి వచ్చి చూచివెళ్ళేవారు. వారితో పాటు ఇతర నాయకులను కూడా వెంట పెట్టుకొచ్చేవారు. ద్రోణంరాజు సత్యనారాయణ, విశాఖపట్నం, కమ్ముల బాల సుబ్బారావు, ఎమ్.పి., నిడమోలు ఎమ్.ఎల్.ఎ. సోమేశ్వరరావు, గంటా కృష్ణమూర్తి మొదలైన వారెంతోమంది వచ్చారు. వచ్చే ఒక గంట ముందు చెప్పేవారు భోజనానికి వస్తున్నామని. ఎవరెవరు వస్తున్నారో ఎంతమంది వస్తున్నారో చెప్పేవారు కాదు. వారి చెల్లి అందుకని కారులో ఎంతమంది పడతారో అంతమందికి వంట చేసి రెడీగా ఉంచేది. 1963లో నేను నాగార్జున సాగర్ ప్రాజెక్ట్ హిల్ కాలనీలో పనిచేస్తున్నా. అవనిగడ్డలో ఆర్.ఎమ్.పి. డాక్టర్ రామమోహనరావు వీరికి ఆప్తమిత్రులు. వారిని వెంటపెట్టుకొని ప్రాజెక్ట్‌ని చూడడానికి హిల్ కాలనీ వచ్చారు. నందికొండ మ్యూజియంతో సహా అన్ని చూపెట్టడం జరిగింది. రామమోహనరావుగారు ఉల్లిపాయ ఉన్న కూర వారు తినరని వారికి ప్రత్యేకముగా వంట చేసిన దానికి వారు ఎప్పుడు కలిసినా అదే గుర్తు చేసేవారు. నేను ధవళేశ్వరంలో వున్నప్పుడు కాంగ్రెస్ నాయకులు పంతం పద్మనాభం గారికి అస్వస్థతగా వున్నప్పుడు క్రిష్ణారావు గారితో కలసి నేను కూడా వెళ్ళి వారిని పరామర్శించినాము. పైన చెప్పినట్లుగా మేము ఎక్కడ పనిచేస్తుంటే అక్కడకు తప్పక వచ్చి చూచి వెళుతూ వుండేవారు. అమలాపురం, ఉండి, ఆకివీడు, ఏలూరు మొదలైన అన్ని చోట్లకు వచ్చి మా బాగోగులు

తెలుసుకునేవారు. ఇంకొక ముఖ్య విషయమేమంటే వారి దగ్గర బంధువలలో ఎవరి ఆర్థిక పరిస్థితి ఎలా ఉందో గమనించేవారు. ఎవరి కుటుంబ పరిస్థితి అయినా బాగోలేక ఆడపిల్లలు పెళ్లి చేయడం ఇబ్బంది పడుతుంటే, నా బోటి వాళ్ళతో సంప్రదించి తగిన ఆర్థిక సహాయం కూడగట్టి ఆడపిల్లల పెళ్ళిళ్ళు స్వయంగా దగ్గర వుండి జరిపించేవారు. ఇది చాలా గొప్ప విషయం.

వెంకట కృష్ణారావుగారి జననం పల్లెవాడ గ్రామములో వారి మాతామహులు ఇంట జరిగిందంట. ఆ విధముగా ఆ గ్రామముపై వారికి ప్రత్యేక శ్రద్ధ వుండేది. అందుచేత వారి గౌరవార్థం పల్లెవాడ గ్రామములో ది.28-12-2008న నేషనల్ కాంగ్రెస్ వ్యవస్థాపక దినమున వారి యొక్క విగ్రహం ప్రతిష్టాపన ఘనముగా జరిగింది. పిన్నమనేని కోటేశ్వరరావు గారిచే ఆవిష్కరించబడింది. మంత్రులు, పార్లమెంటు మెంబర్లు, ఎమ్.ఎల్.ఎ.లు, ఎమ్.ఎల్.సి.లు తదితరులెందరో ముఖ్య నాయకుల సమక్షంలో కార్యక్రమము దిగ్విజయముగా జరిగింది. ఆ సందర్భములోనే గ్రామ ప్రజల కోరిక మేరకు గ్రామమునకు రూ.20 లక్షలు ఖర్చుతో మంచినీటి సదుపాయము కల్పించడమైనది. అందుకు కారకులైన అప్పటి మంత్రివర్యులు మండలి బుద్ధప్రసాద్ గారు, పిన్నమనేని వెంకటేశ్వరరావు గార్లకు గ్రామ ప్రజలు సర్వదా కృతజ్ఞులు.

★ ★ ★




*బాలల అకాడమి కార్యనిర్వహకులతో....*



మండలి వెంకట కృష్ణారావు, శ్రీమతి ప్రభావతీ దేవి